ఈ నాడు సాధనా ప్రపంచం ఈ ఆనందానుభూతికై ఆర్రులుచాస్తోంది. అందుకై విశేషంగా అన్వేషిస్తోంది. మనసా ఆరాధిస్తోంది. భారతీయులంగా పుట్టి ఆ విశిష్ట సంస్కృతికి వారసులమైనందుకు మనం ఆనందిద్దాం. భౌతిక సుఖాభిలాషలో మరుగున పడిపోయిన ఆ ఉత్తమ విద్య అనుభవానికి తెచ్చుకొని, అభ్యుదయం సాధిద్దాం. ఉత్కృష్టమైన ఆ పరమ సుఖాన్ని ప్రపంచానికి పంచుదాం, ఉన్నతమైన గురుపీఠాన్ని అధిష్టించగల ఆ పరమ వైభవ స్థితిని తిరిగి అందుకొందాం. శాశ్వతమైన ఆత్మ సుఖాన్ని పొందుదాం.

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః



మాతృశ్రీ చరణకమలములకు

అంకితం

గర్భమున దాల్చి, కని, పెంచి దుర్భరంబు లైన కష్టముల సహించి, ఆదరించి బ్రతుకు పూయించు ననురాగవల్లి! తల్లి! ఋణము తీరునా? ఈ పాటి కృతికి, సుకృతి!



ఓం

# వాల్మీకి వాణి

❖ శ్లోకత్వమాగతః (40-2-1)

క్రౌంచపక్షి బాధగన్న వాల్మీకి హృదయంలోని ఆవేదనయే శ్లోకంగా పరిణమించింది. అదే రామాయణానికి నాంది పలికింది. ధర్మాత్ముడైన ఆ ఋషికి కలిగిన కరుణయే కావ్యమై వెలిసింది. అది గిరులు, ఝరులు ఉన్నంత కాలం నిత్యమై సత్యమై నిలుస్తుంది.

యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే। (36-2-1)
తావ ద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి।

లోకంయొక్క సుఖ దుఃఖాలుచూచి స్పందించినవాడే నిజమైనకవి. అతని కావ్యమే లోకానికి ఎక్కువగా హితము, సన్నిహితము అవుతుంది.

రామాయణ రచనకు వాల్మీకి మహర్షిని ప్రోత్సహించిన బ్రహ్మ "నీకు రామచరిత్ర సర్వం విదితమౌతుంది. కావ్యంలో నీ వాక్కు ఎక్కడా అనృతం కాదు" అని వరం ప్రసాదించాడు.

తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి
నతే వాగనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి (34-2-1)

వాల్మీకి, ధర్మ విగ్రహుడైన శ్రీరాముని చరిత్ర సమస్తం యోగంలో తత్త్వ దృష్టితో దర్శించి రస నిర్భరమైన కావ్యంగా ప్రకటించాడు. 1అంతర్ముఖుడైనమునికి జరిగిన చరిత్ర అంతా కరతలామలకంగా కళ్ళకు కట్టినట్లు తోచింది.

తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగమాస్థితః
పురాయత్తత్ర నిర్వృత్తం పాణా వామలకం యథా। (6-3-1)

❖ గేయే పాఠ్యేచ మధురమ్ । (6-3-1)

మధురమైన ఈ రామాయణం స్వర యుక్తంగా గానం చెయ్యటానికి, శ్లోకరూపంలో చక్కగా చదవడానికి తగినదై ఉండటంచేత సహృదయుల్ని ఎంతగానో అలరిస్తుంది.

గాన కోవిదులైన (కుశీలవులు) కుశలవులు పాడిన ఈ రామాయణం మనోహరమైన ఒక సంగీత రూపకమై, విశ్వమానవ హృదయ విపంచికలను

మీటి, మానవతను మేలుకొలిపింది. సాహిత్య ప్రపంచంలో ఆదికావ్యమై మహిత రసానందాన్ని అమితంగా శ్రోతలకు అందించింది. సంప్రదాయ విశిష్టమైన సభ్యతను, సంస్క ృతిని పాదుకొల్పి, జాతి గౌరవాన్ని చాటిచెప్పింది. సర్వజన రంజకమై, గుండె, గుండెకొక గుడికట్టి, అందులో రాముని ప్రతిష్టించి, ప్రతి ఒక్కరినీ సుగుణాభిరామునిగా తీర్చిదిద్దటానికి ప్రయత్నించింది. వాల్మీకి హృదయాన్ని సుందరంగా ఆవిష్కరించింది.

❖ ప్రియా రామకథాహిమే (19-31-5) రామకథ అంటే నా కెంతోఇష్టం.

సీతాన్వేషణ నిమిత్తం రామదూతయై లంకకు వచ్చిన హనుమంతునితో సీత, "నీవు రాముని చూడటం నిజమైనట్లైతే అతని రూప, గుణ విశేషము లెటువంటివో వివరింపుమని ఆసక్తితో అడిగింది. హనుమంతుడు భగవంతునిగూర్చి చెప్పే ఆచార్యునివలె ఆమె అడిగినవన్నీ విపులంగా ఎంతో ఉత్సాహంగా వర్ణించిచెప్పి సీతకు విశ్వాస పాత్రుడయ్యాడు. సీతకు, రాముని యెడగల ఈ అనురాగ విషయాన్ని ఆత్మకు పరమాత్మ యెడగల పరమ ప్రీతిగా వేదాంతవేత్తలైన పెద్దలు అభివర్ణించారు. ప్రకృతి పురుషుల సంయోగమే సీతారాముల అనుబంధమని వారి సిద్ధాంతం. ఇక్కడ రాముని సద్గుణాలు, సాముద్రికలక్షణాలు విశేషంగా వివరింపబడ్డాయి.

సత్యము, ధర్మము, ధైర్యము, శౌర్యము, సౌశీల్యము, సౌజన్యము మొదలైన ఉత్తమ గుణములు గల శ్రీరాముని పవిత్ర చరిత్ర ప్రపంచానికే మిక్కిలి ప్రియమైనది కాగా, పతివ్రత సీతకు ప్రీతిపాత్రం కావడంలో ఆశ్చర్యమేమున్నది?

లోకోత్తర గుణసంపన్నుడైన ఆ రాముడు అన్నింటిలోను పెద్దలకెల్ల పెద్దగా కీర్తింపబడ్డాడు. లోకాభిరాముడై అందరిచేత ఆరాధింపబడ్డాడు. పురుషోత్తముడైన ఆ రాముని విపులమైన గుణవర్ణనమే రామాయణంగా ప్రసిద్ధికెక్కింది. ఇందులో చెడును నిరసించడంతో బాటు మంచిని ప్రశంసించడం చూస్తే భగవాన్ వాల్మీకికి గల సంఘ సంస్కరణాభిలాష వ్యక్తమవుతుంది. రామచరిత్ర ద్వారా ఆదర్శ మానవ జీవిత విధానాన్ని మార్గదర్శనంచేసిన రామాయణం, సమాజ శ్రేయస్సును, విశ్వశాంతిని ఆకాంక్షించింది. అమరమైన ఆ "వాల్మీకివాణి" ఈ లోకానికి అమృతాన్ని పంచి ఇచ్చింది. వికృతులను పోగొట్టి ప్రకృతి సిద్ధులుగా చేసే సు కృతియే



వ్యా:- సుందరకాండ కథాపరంగా, రచనా పరంగా కూడా చాలా సుందరమైనది. "సుందరేకిం న సుందరమ్" అన్నట్లు ఇందలి ప్రతి అంశము సుందరమే. ఆత్మ తత్త్వవేత్తలైన యోగులు ఈ సుందరకాండ కుండలినీ యోగమే అని వివరించారు.

ఇందులో దశగ్రీవుడైన రావణుడు దశేంద్రియములకు ప్రతీక. రావణునిచే అపహరింపబడిన సీత మనస్సు, సీతాన్వేషణకై బయలు దేరిన హనుమంతుడు యోగి. అతడు కామ క్రోధాదులైన అంతశ్శత్రువుల జయింపగల దిట్ట. రాముడు బుద్ధి. ఇంద్రియ నిగ్రహం ద్వారా మనస్సును బుద్ధితో యోజన చేయుటకు యత్నించుటే యోగము. (చారణా + అచరితే పథి) చరణములతో సంచరించుటకు వీలులేని యోగమార్గమే కుండలిని. అది ప్రాణుల వెన్నముకలో ఉంటుంది. పారమార్థిక దృష్టితో యోగులు దాన్ని గుర్తించ గలుగుతారు. ప్రాణామాయం ద్వారా అది సిద్ధిస్తుంది. అందుకు తగిన నియమంతో సాధన చేయాలి.

లంకయే శరీరమని, అందులో అశోకవనమే సహస్రారమని, సీతయే చిత్కళా స్వరూపమని, ఆమెను సందర్శించ గలుగుటే యోగ సిద్ధియని, ఆ ప్రయత్నంలో హనుమంతునకు ఎదురైన అవరోధములే (ఇబ్బందులే) సాధనా మార్గంలో యోగికి ఏర్పడే అంతరాయములని చెప్పి, సమర్థతతో అన్నింటిని అధిగమించి, ఏకాగ్ర చిత్తంతో ఆ పరమ లక్ష్యాన్ని చేరుకోవటమే జీవిత పరమార్థమని పెద్దలు వివరించారు. పెద్దయిన తర్వాత ఎప్పుడో చేద్దామని ఊరుకొంటే అప్పటికి శరీరం, మనస్సు స్వాధీనంలో లేకపోవచ్చు అంతలో జీవితమే అంతం కావచ్చు. అందువల్ల ఇప్పటి నుండీ ఆ ప్రయత్నం చెయ్యాలి. ఇక మరో జన్మలో మంచి చెడు తెలుసుకొనే ఈ మానవత్వమే లభిస్తుందని ఏమిటి నమ్మకం?

పక్షి ఆకాశంలో ఎంత దూరం పయనించినా, చివరకు గూటికి చేరినట్లే జీవులు లోకంలో ఎంతటి ఉన్నతాధికార, సంపదల వలన కలిగే భోగములు అనుభవించినా, పరమశాంతికై తుదకు చేరదగిన గమ్యం ఇదే. అని విశేషజ్ఞులైన మన ఋషిపుంగవులు బోధించారు. భారతీయ జీవన సంస్కృతికి ఇదే పట్టుకొమ్మ. సౌశీల్యము, సత్ప్రవర్తన అందుకు సాధనములుగా ఉపకరిస్తాయి. ఇదే మనకు సాహిత్యం అందించిన ఉపదేశ సారాంశం. ఇదే భారతీయ సంస్కృతి సర్వస్వం.

సం:- యుద్ధరంగమున అగస్త్యుడు రామునకు ఆదిత్య హృదయమును ఉపదేశించుట.

వ్యా:-ఆదిత్య హృదయ మొక సూర్యస్తుతి. ఆ సౌరశక్తి అనంతము. విజ్ఞాన వేత్తల పరిశోధనా పరంపరల వలన నేడు ఆ ప్రయోజనములు ప్రపంచ మానవాళికి ఎక్కువగా అందుబాటులోకి వస్తున్నాయి. శారీరక, మానసిక ఆరోగ్యాన్ని ప్రసాదించి, ప్రకృతి శక్తులకు మూలకారణమై వెలుగొందు సూర్యుని సర్వదేవతా స్వరూపునిగా సంభావించి పూర్వులారాధించారు. సంధ్యా వందనంలో ఉపాస్యదైవము ఆ సవితయే. ఆ మంత్రమే సావిత్రి. దానినే గాయత్రి అంటారు. వేదంలో 'అరుణమ'నే భాగం ప్రత్యేకమైన సూర్యస్తోత్రంగా ప్రసిద్ధి చెందింది. ప్రకృతి చికిత్సలో సూర్యకిరణములకు అధిక ప్రాధాన్యం ఉంది. మయూరుడనే కవి 'సూర్యశతకం' వ్రాసి కుష్ఠురోగం నుండి విముక్తుడైనట్లు సాహిత్య చరిత్ర చెప్తోంది. స్కాంద పురాణంలో కాశీఖండంలో సౌరశక్తితో (సోలార్) వండిన ఆహారం భుజించినట్లు వర్ణింపబడింది.

సనాతన రహస్యమైన ఈ ఆదిత్య హృదయము పుణ్యదాయకము. సర్వ శత్రు నివారకము, జయావహము, శుభకరము, సకల పాపహరమునై చింతాశోకములను తొలగించి, ఆయువును వృద్ధి పొందించును. ఉత్తమమగు దీనిని భక్తితో జపించు వారెన్నడు పరాజయ మెఱుగరు. రాముడీ స్తోత్రమును ముమ్మారు పఠించి ధైర్యోత్సాహములు ఇనుపడింప, రావణుని అవలీలగా సంహరించాడు. రామాయణంలో సుందరకాండతో బాటు ఈ ఆదిత్య హృదయము నిత్యపారాయణార్హమై పఠితలకు ఆత్మవిశ్వాసాన్ని, ఆధ్యాత్మిక వికాసాన్ని కలుగజేస్తోంది.

## యోగము

❖ తతో రావణ నీతాయాః సీతాయాః శత్రు కర్శనః।
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితేపథి॥ (1-1-5)

భా:- రావణునిచే బలాత్కారముగ తీసుకొని పోబడిన సీత జాడ వెదుకుటకై శత్రుమర్దనుడైన హనుమంతుడు, చారణులు సంచరించు ఆకాశమార్గమున వెడలుటకు సంకల్పించెను. ఈ శ్లోకంతోనే సుందరకాండ ప్రారంభం.



రామాయణం. అందుకే అందరం ఈ నాటికీ "ప్రియా రామకథాహిమే" అని అనుకొంటున్నాం వేదవేద్యుడైన ఆ పరమ పురుషుడు దశరథ తనయుడైన రాముడై అవతరింపగా వేదమే ప్రాచేతసుడైన వాల్మీకినోట రామాయణంగా వెలువడింది.

❖ తత్త్రికాలహితం వాక్యం ధర్మ్య, మర్థాను బంధిచ బుద్ధస్వ। (21-51-5)

త్రికాల హితములు, శుభకరకములు, ధర్మ యుక్తములు అయిన ఆ మధుర వచనములు వినడం మననం చేయడం, అనుభవానికి తెచ్చుకోవడం మన కర్తవ్యం. ఆ ఋషి ఋణం తీర్చడానికి అదే సరియైన మార్గం, అందుకు ముందుగా వాల్మీకి మునికి అంజలి ఘటించడం కృతజ్ఞత అవుతుంది.

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥

మధురంగా మధురాక్షర సంభరితంగా అక్షరమైన ఆ రామతత్వాన్ని ఆలపించిన కవికోకిల వాల్మీకి ప్రపంచానికి సర్వదా అభినందనీయుడవుతాడు.

❖ వేదోపబృంహణార్థాయ తావద్గ్రాహయతః ప్రభుః (6-4-1)

వేదార్థమును వివరించుటకై వాల్మీకి, రామాయణం రచించాడు. వేదాన్ని అధ్యయనం చెయ్యడం అందరికీ సాధ్యంకాదు. అందుకు చాలా సమయం, సహనం కావాలి. అంతేకాక అధ్యయన శీలంతోబాటు ఆలోచనా ధోకణిగలవారికొఱకై వేదధర్మం కథారూపంలో రావలసిన అవసరం ఏర్పడింది. ద్రష్టయైన వాల్మీకి మహర్షి ఆ అవసరాన్ని గుర్తించి, ధర్మ కామార్థములతో గూడిన ఈ ఇక్ష్వాకు వంశచరిత్ర వర్ణించాడు.

లోకహిత నిష్ఠతో ఆ మహర్షి అందించిన ఈ రామాయణం అసూయవిడచి, వినండని మానవజాతికి స్వయంగా విన్నవించాడు.

తదిదం వర్తయిష్యామి సర్వం నిఖిల మాదితః।
ధర్మకామార్థ సహితం, శ్రోతవ్య మనసూయయా। (4-5-1)

పవిత్రము, పాపహరము, పుణ్యసాధనము, వేద సమ్మితము అయిన ఈ రామాయణం పఠించటం వలన సకల దోషములు పరిహరింపబడతాయి.

ఇదం పవిత్రం, పాపఘ్నం, పుణ్యం, వేదైశ్చ సమ్మితం
యః పఠే ద్రామ చరితం సర్వపాపైః ప్రముచ్యతే (98-1-1)

సర్వజ్ఞుడైన ఆ ఋషి వాక్కులో అనేక ధర్మములు ప్రవచింపబడ్డాయి. పరమార్థచింతనకు సాధనములైన ఆధ్యాత్మిక విషయములేగాక నిత్యజీవితంలో అందరకు ఆచరణయోగ్యమైన సామాన్య ధర్మములు, విశిష్ట ధర్మములు కూడా ఇందులో చోటు చేసుకొన్నాయి. ఆ యా వ్యక్తులకు సంబంధించిన ప్రత్యేక ధర్మములు పాత్రల స్వరూప, స్వభావములు సుందరముగా వర్ణింపబడ్డాయి. ధీరోదాత్తనాయకుడైన శ్రీరాముని ఆదర్శ జీవనవిధానం సర్వాత్మనా నిరూపింపబడింది. మహత్వపూర్ణమైన సీతాచరిత్ర విశేషంగా కీర్తింపబడింది. సత్యధర్మములకు ప్రతీకలైన ఆ మహాత్ముల జీవితం సంస్మరించటం ద్వారా మన మనస్సులు పునీతం అవుతాయి. ధర్మాచరణ సాధ్యమవుతుంది.

ఇట్టి "వాల్మీకి వాణి" మానవజాతి మహోన్నతికి మార్గదర్శకం కాగదలదని ఆశించి, అది అందరికి అందుబాటులో ఉండేలా సరళమైన వ్యవహారిక భాషలో అందించటానికి ప్రయత్నం జరిగింది. పాఠక ప్రపంచం అనుగ్రహంతో ఇందులోని మంచిని గ్రహించి ఆశీర్వదిస్తుందని ఆశిస్తున్నాను.

## సామాన్య ధర్మములు

### మాట - మంత్రము

❖ వాచా ధర్మమవాప్నుహి

భా:- మాటచెప్పి పుణ్యంకట్టుకో (10-39-5)

సం:- తన క్షేమవార్త రామునితో చెప్పి, అతడు తనను ఈ రక్కసుల చెఱ నుండి తప్పించి కాపాడేందుకు సాయపడమని లంకలో సీత, హనుమంతుని పైవిధంగా కోరింది.

వ్యా:- ఈ సృష్టిలో గల చరాచరములైన జీవరాశులన్నింటిలోను భావవినిమయానికి తగిన భాషమానవునకొక్కనికే సాధ్యం. భగవంతుడు వరంగా ప్రసాదించిన ఆ మాట పుణ్యకార్యానికి మాత్రమే వినియోగించాలన్నది ఇక్కడ మహర్షి ఉపదేశంగా గ్రహింపవచ్చు. రాగద్వేషములతో అనుచితమైన రీతిగా వాక్కును వ్యర్థం చేయరాదన్నది దాని ఉద్దేశం.

మాటకెంతో బలం ఉంది. ఒకప్పుడది పోయేప్రాణాన్ని నిలుపుతుంది. అదుపుతప్పితే ఒక్కొక్కప్పుడు ప్రాణం తీస్తుంది కూడ. ఆ మాటే, మన్ననకు కారణం.



బట్టి" లోక నింద్యములైన దుష్కర్మలను విడిచి పెట్టాలి. ఇంక పెద్దలు ఆచరించిన వానిలోను, వారితరులకు చెప్పిన వానిలోను యోగ్యములు, ధర్మ సమ్మతములు అయిన శుభకర్మములనే అనుష్ఠించాలి. తక్కినవి విసర్జించాలి. పెద్దలు చేశారనో, లేక ప్రోత్సహించారనో **చెడును అనుసరించడం తగదు.**

నిత్యనిష్ఠకై అడవులకు బయలు దేరిన రాముని తండ్రి దశరథుడు అతని తొలుత సుఖంగా పోయిరమ్మని ఆశీర్వదించి, అంతలో పుత్ర వ్యామోహంతో వెళ్ళ వద్దంటే, రాముడది అధర్మము, అనృతము అవుతుందని వినలేదు. తల్లి కౌసల్య రాముని అడవులకు వెళ్ళవద్దన్నా, లేక తనతో గూడి ఆమె అరణ్యములకు వస్తానన్నా అంగీకరింపక రాముడు "శుశ్రూషా మేవ కుర్వీత భర్తుః ప్రియ హితేరతా, ఏష ధర్మః పురాదృష్టోలోకే వేదే శ్రుతః స్మృతః" (27-24-2) స్త్రీకి భర్తృసేవా ధర్మంలో గల విశేషాన్ని వివరించి, ఆమెను సమాధాన పరచి, తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. చిత్రకూటంలో వశిష్ఠుడు రాముని అయోధ్యకు రమ్మని గురువుగా ఆదేశించినప్పుడు, తనకు పితృ సత్య వాక్య పరిపాలనమే ముఖ్య ధర్మమని ఇప్పుడా విధంగా చేయుటయే యుక్తమని చెప్పి, అతనిని ఒప్పించాడు. సద్ధర్మనిష్ఠుడై అందరిచేత ప్రస్తుతి చెందాడు.

శత్రువైన మారీచుడు కూడా "రామోవిగ్రహవాన్ ధర్మః, సాధు స్సత్య పరాక్రమః" అని పొగిడాడు. ధర్మము ప్రవృత్తి, నివృత్తి అని రెండు రకాలుగా పేర్కొనబడింది. ప్రపంచంలో అంతటా ప్రవృత్తి ధర్మం చెప్పబడి ఉంటుంది. లౌకిక జీవనానికి అది తోడ్పడుతుంది. నివృత్తి ధర్మం భారతీయుల విశిష్టతను నిరూపిస్తుంది. పరమశాంతికది ప్రథమసోపానమై నిలుస్తుంది. ముక్తినిస్తుంది.

❖ బాలానాంతు శుభం వాక్యం గ్రాహ్యం. లక్ష్మణ పూర్వజ!(26-33-7)

భా:- శుభకరమగు వాక్యమైనచో పిన్నలు చెప్పినను గ్రహింపదగును.

### సౌరశక్తి

❖ పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥ (6-107-6)

భా:- అనితర సాధారణమైన తేజో విశేషముచే, భువనములను ప్రకాశింపజేయు భాస్కరుని పూజింపుము.

దేశే దేశే కళత్రాణి, దేశే దేశేచ బాంధవాః।

తంతుదేశం నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః॥ (12-102-6)

ధర్మ సంభృతమైన ఈ రామాయణం ఒక కల్పవృక్షం. ప్రకృతిలో గల వృక్ష సంతతి కలుషిత వాతావరణాన్ని శుద్ధిచేసి, జీవులకు ప్రాణశక్తిని ప్రసాదించినట్లుగానే రామాయణం కుటుంబంలోని, సమాజంలోని వ్యక్తుల మధ్య పేరుకొని పోయిన మానసిక కాలుష్యాన్ని రూపుమాపి, తగిన సభ్యత, సంస్కారములను అందిస్తుంది.

## పరులను అవమానింపరాదు

❖ పరేషాం సహసాఽవజ్ఞా న కర్తవ్యా కథంచన (12-9-6)

భా:- తొందరపడి ఇతరుల శక్తి సామర్థ్యములను తక్కువగా భావించి అవమానించరాదు.

వ్యా:- దురహంకారులు, దుర్మదాంధులు అయిన వారు తమను తామే గొప్పగా ఊహించుకోవడమే గాక, ఇతరులను కించపరచటానికి కూడ ప్రయత్నిస్తారు. అట్టిది ఆత్మ వినాశనానికే దారి తీస్తుంది.

రావణాదులు రాముని అపరిమేయమగు బలపరాక్రమములను పరిగణింపక, అకృత్యములకు పాల్పడి నిహతులైనారు.

## గురువులు

❖ ఆచార్యశ్చ, పితా, మాతా భవన్తి గురవ స్త్రయః (2-111-2)

భా:- తల్లి, తండ్రి, గురువు అను వారు ముగ్గురూ గురువులు.

❖ గురువృత్యనురోధేన నకించి దపి దుర్లభమ్ (36-30-2)

భా:- పెద్దలగువారిని అనుసరించుటవలన లోకంలో సాధ్యంకానిది లేదు.

❖ గురుపూజాయాం ధర్మశ్చాప్యతులో మహాన్ (16-31-2)

భా:- గురువులగు వారిని పూజించుటయే గొప్ప ధర్మము.

## మంచినే ఆచరించాలి

"యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి, యాన్య స్మాకగ్ం సుచరితాని తాని సేవితవ్యాని, నో ఇతరాణి." అను శ్రుతి వచనమును



పవిత్రమైన ఆ వాక్కు యొక్క మహత్వాన్ని గుర్తించి లోకం సంయమనంతో వ్యవహరిస్తే మనిషి మహర్షి అవుతాడు. అప్పుడతని మాట మంత్రమై ప్రపంచానికి రాచబాటగా పరిణమిస్తుంది.

"పరోపకారమే పుణ్యమని, పరపీడనమే పాపమని" పెద్దలు చెప్పిన సూక్తి ననుసరించి, భూతహితంగా పలికిన మాటలు పుణ్య సంపాదకములై సార్థకములవుతాయి. ఇట్టి వాఙ్నియమమునే వాచిక తపస్సుగా గీతాచార్యుడు ఉద్బోధించాడు.

## నడవడి

❖ చారిత్ర మేవ వ్యాఖ్యాతి శుచివా యదివాఽశుచిమ్ (4-109-2)

భా:- నడవడియే ప్రాణుల మంచి చెడులను వివరిస్తుంది.

❖ సంతశ్చారిత్ర భూషణః (43-113-6)

భా:- సజ్జనులకు చరిత్రయే అలంకారము.

వ్యా:- హార, కేయూర. మకుట, కటకాది అలంకారములు ఎన్ని ధరించినా మనిషికి అన్నింటికి మించిన అలంకారం మంచి నడవడి ఒక్కటే. ఆ చరిత్రయే వ్యక్తిత్వానికి వన్నెతెస్తుంది. అహింస, భూతదయ, శాంతి, సహనము మొదలగు గుణములే మానవులను మహనీయులుగా చేస్తాయి. అట్టి సాధుజనుల చరిత్రయే మానవజాతికి మాన్యము, మార్గదర్శకము అవుతుంది.

❖ మానం న లభతే సత్సు భిన్నచారిత్ర దర్శనః (3-109-2)

భా:- దుష్టవర్తన గల వారికి మంచివారిలో మర్యాద లభింపదు.

వ్యా: చెడు ప్రవర్తనగలవారు, మర్యాదను పోగొట్టుకొని సభ్యసమాజంచేత అనుమానింపబడతారు. అవమానింపబడతారు. అంతేకాదు వారట్టి ప్రవర్తనను మార్చుకొనక, దుర్జనులై వ్యవహరిస్తూనే ఉంటే, శిక్షార్హులు కూడా అవుతారు. రాముడు దుష్టచరిత్రుడైన వాలిని వధించటంలో ఈ విషయమే ప్రస్తావింపబడింది.

యావత్తం నాభిపశ్యామి, తవ భార్యాపహారిణమ్ ।

తావత్స జీవే త్పాపాత్మా, వాలీచారిత్ర దూషకః ॥ (33-10-4)

❖ న హి దుష్టాత్మనా మార్య మావసత్యాలయే చిరమ్ । (11-50-3)

భా:- దుష్టుల ఆశ్రయంలో సంపద కూడ ఎంతో కాలం నివసింపదు.

వ్యా: దుష్టులు, అధికార సంపదల నుండి శీఘ్రముగా పతన మగుట విదితమే కదా! ఇంద్రుని సింహాసనం అధిష్టించిన నహుషుని దురాలోచన అతనిని పదవీభ్రష్టుని చేసింది. నికృష్ట జీవితమును కల్పించింది.

## ఆడి తప్పుట పాడికాదు

❖ ఉపశ్రుత్య కరిష్యేతి ఉక్తం వాక్య మకుర్వతః।
ఇష్టా పూర్తవధో భూయాత్, తస్మాద్రామం విసర్జయ ॥ (3-21-1)

భా: అనృత భాషణము వలన అపనిందతోబాటు పూర్వ మొనరించిన పుణ్యఫలము సహితము నశిస్తుంది.

సం:- మీరు ఏది అడిగినా ఇస్తానని ముందుగా మాట ఇచ్చి, "యాగ సంరక్షణకై రాముని పంపుమని అడిగిన విశ్వామిత్రునితో తిరిగి వీలుకాదని చెప్పిన దశరథునకు వశిష్టుడు కర్తవ్యాన్ని ఇలా ఉపదేశించాడు.

వ్యా: "ఇష్టం" అంటే యజ్ఞయాగాదులు, "పూర్త" మంటే వాపీ, కూప, తటాక, ఆలయ గోపుర ప్రతిష్టాదులు. వీనినే సప్తసంతానములంటారు. కృతి నిర్మాణం కూడ అందులో ఒకటి. ఆడి తప్పిన వారికి ఈ రెండింటి వలన కలిగే పుణ్యఫలం కూడా లుప్తమైపోతుంది. అసత్య మాడితే వచ్చే అనర్థం తెలిస్తే లోకం సత్యాన్ని పాటించడానికే ప్రయత్నించవచ్చు. నిప్పు కాలుతుందని తెలిస్తే ముట్టుకోరుకదా!

సర్పాన్ని చూసి మానవులు ఏరకంగా ఉద్వేగాన్ని పొందుతారో అదే విధంగా అసత్యవాదిని చూచి కూడా, ప్రజలు ఉద్వేగపడతారు. "ఉద్విజంతే యథా సర్పాన్నరా దనృత వాదినః" (12-109-2) అందువల్ల అసత్యమాడరాదు. మాటకు, సత్యమే ప్రాణము.

## గుణ గ్రహణ పారీణత

❖ గుణతః సంగ్రహం కుర్యాత్ దోషతస్తు విసర్జయేత్ (41-17-6)

భా:- ఎక్కడైనా గుణాన్ని మాత్రమే గ్రహించి, దోషాన్ని విడిచిపెట్టాలి.

వ్యా:- హంసనీటిని, పాలను వేఱుచేసి, పాలను మాత్రమే స్వీకరిస్తుంది. అది దాని ప్రత్యేకత. అది సృష్టికర్త దానికి కల్పించిన విశిష్టత. అలాగే ఒక



వ్యా:- ఫలితమేమిటో తెలియనప్పుడు, ప్రాణికోటిని హింసల పాలుచేసే, ఆ యుద్ధాన్ని నమ్ముకొని తన జీవితాన్ని, తన తోటి వారి జీవితాల్ని కల్లోలంలో పడవేయడం మూర్ఖత.

## అన్నను మన్నించాలి

❖ ఏషలోకే సతాం ధర్మో యజ్జేష్ఠ వశగో భవేత్ (6-40-2)

భా:- అన్నమాట మన్నించుటే లోకంలో మిక్కిలి ధర్మము.

❖ జ్యేష్ఠో మాన్యః పితృసమః (18-16-6)

భా:- పితృ సముడైన జ్యేష్ఠుడు (అన్న) గౌరవింపదగిన వాడు.

వ్యా:- అందువల్లనే అన్నవెంట అడవులకు వెళ్ళుచున్న లక్ష్మణునితో అతని తల్లి సుమిత్ర "నాయనా! రాముని దశరధునిగాను, సీతను తల్లిగాను అడవిని అయోధ్యగాను, సంభావింపు"మని చెప్పిపంపింది.

రామం దశరథం విద్ధి, మాంవిద్ధి జనకాత్మ జాం।
అయోధ్యా మటవీం విద్ధి, గచ్ఛ తాత యథా సుఖమ్॥ (9-40-2)

లక్ష్మణుడు, వారి యెడ ఆ విధమైన భక్తి ప్రపత్తులతోనే ప్రవర్తించాడు. ఋశ్యమూక పర్వతం మీద హనుమంతుడు తెచ్చి చూపించిన నగల మూటను చూసి, సీతాస్మరణంతో అశ్రుపూరితనయనుడైన రాముడు "లక్ష్మణా! ఈ నగలు సీతవేనేమో, గుర్తించమ"ని అడిగితే "అన్నా! నేను ఆమె ధరించే కేయూరములను, కుండలములను ఎఱుగను, నిత్యము పాదాభివందనము చేయుట వలన పరిచితములైన నూపురములు(అందెలు) మాత్రము గుర్తించగలనని చెప్పాడు. **వదినను అమ్మగా గౌరవించడం అతని సంస్కారము.** సమాజానికదే ఆదర్శము.

నాహం జానామి కేయూరే, నాహంజానామి కుండలే!
నూపురే త్వభిజానామి, నిత్యం పాదాభి వందనాత్॥ (22-6-4)

ఇట్టి తమ్ముడు, లక్ష్మణుడు రణరంగంలో రావణుని శక్తి ప్రహారహానికి గుఱియై మూర్ఛపోవటం చూచి రాముడు "భార్యా, బంధువులు ఏ దేశంలోనైనా లభిస్తారు. ఇట్టి సోదరుడు మాత్రం ఎక్కడా లభించడు ఇతడు లేని వ్యర్థ జీవితం ఇంక నా కెందుక"ని విలపిస్తాడు. **ఇదీ రాముని సోదర ప్రేమ.**

సమావేశమై సంప్రదించాలి. అప్పుడే జటిలమైన ఏ సమస్యకైనా సరియైన పరిష్కారం లభిస్తుంది. అట్టి ఆలోచనా పద్ధతిని గుప్తంగా కాపాడుకొంటూ, నిపుణతతో ఆచరణలో పెట్టినప్పుడు విజయం తప్పక సిద్ధిస్తుంది. రాజకీయ రంగంలో ఇది చాలా ముఖ్యము.

## దురాశయే దుఃఖానికి హేతువు

❖ తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయం (17-50-3)

భా:- జీవులు తమ ఆరోగ్యం కాపాడు కొనేందుకు జీర్ణమయ్యేంత ఆహారమునే స్వీకరించాలి.

❖ సభార సౌమ్య భర్తవ్యో యో నరా నావసాదయేత్ (17-50-3)

భా:- మానవులు తాము క్రుంగక, మోయ గలిగినంత బరువునే మోయాలి.

సం:- పంచవటిలో రావణుని ఉద్దేశించి జటాయువు "ఓ రావణా! జగదైక వీరుడైన రాముని భార్య, పతివ్రతయైన సీతను దొంగతనంగా అపహరించుకొని పోవటం నీకు తగదు. ఇకనైనా ఈ పరస్త్రీ వ్యామోహం మానుకొని తిన్నగా బ్రతుకు" అని బుద్ధి చెప్పాడు.

వ్యా:- లోకంలో ఎవరైనా అలవికాని పనికి పూనుకొనడం మంచిదికాదు. అత్యాశకు పోయి ఎక్కువగా తింటే అజీర్ణం చేస్తుంది. అలాంటప్పుడా భోజనం విషంగా మారుతుంది. అదే ప్రాణం కూడా తీస్తుంది. అలాగే ఎవరైనా మోయలేని బరువు ఎత్తుకొంటే నడుం విరిగి కుప్పకూలి పోతారు, తిరిగి పైకి లేవకుండానే నశిస్తారు. అందువల్ల ఎవరూ తమ తాహతుకు మించి వ్యవహరించరాదు. లోకంలో ఉన్న సౌఖ్యమంతా తమకే కావాలని కోరుకోవడం దురాశ. దుఃఖానికదే హేతువు. జిహ్వాచాపల్యంతో గాలాన్ని మ్రింగబోయిన చేప దుర్గతి జగమెఱిగిన సంగతేకదా!

## జయాపజయములు

❖ యుద్ధ సిద్ధిర్హి చంచలా (17-46-5)

భా:- యుద్ధమున జయము అనిశ్చితము.

❖ అవ్యవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయ పరాజయౌ॥ (53-37-5)

భా:- యుద్ధమున జయాపజయములు అనియతములై తోచును.



సంఘటన (చరిత్ర) లోను, వ్యక్తి జీవితంలోను మంచి గ్రహించి, చెడును విడిచి పెట్టడం వివేకవంతులు చేయవలసిన పని. అట్టివారే పరమహంసలవుతారు.

రాముడు తనకు పరులు చేసిన అపకారములను పరిగణింపక, ఏ కొంచమైనను చేసిన ఉపకారము చేతనే సంతోషపడెడివాడను ప్రజాభిప్రాయమును వాల్మీకి ఇట్లు ప్రకటించాడు. రాముని సహృదయతకు ఇది నిదర్శనము.

కథంచి దుపకారేణ కృతే నై కేన తుష్యతి ।
న స్మర త్యపకారాణాం శతమ ప్యాత్మవత్తయా॥ (11-1-2)

## అతిథి పూజ

❖ అతిథిః కిల పూజార్హః (120-1-5)

భా:- అతిథి పూజింప తగినవాడు కదా

సం:- సముద్రమును లంఘించు హనుమంతునితో, తమ ఆతిథ్యమును స్వీకరింపుమని మైనాకుడు పలికిన సాదర వచనములివి.

వ్యా:- ఇంటికి వచ్చిన అతిథులను దైవస్వరూపులుగా భావించి విశేషముగా ఆదరించుట భారతీయ సంస్కృతి. ఈ ధర్మమునే "అతిథి దేవోభవ" అని శ్రుతి మనకు ప్రతిబోధించుచున్నది.

## పురుషార్థములు

❖ ధర్మోహి పరమేలోకే (40-21-2)

భా:- ధర్మము పురుషార్థములలో గొప్పది

వ్యా:- భారతీయ సంస్కృతిలో ధర్మము, అర్థము (సంపద), కామము (కోరిక), మోక్షము అను నాలుగు పురుషార్థములు మానవులందరూ సాధింపదగినవిగా పేర్కొనబడ్డాయి. అందులో ధర్మమే శ్రేష్ఠము. అందుకే ధర్మస్వరూపుడైన రాముడు, లక్ష్మణునితో "అధర్మంగా వచ్చిన ఇంద్ర పదవి కూడా నాకిష్టంలేదం"టాడు. అందుచేత ధర్మమే అనుసరణీయం. ధర్మబద్ధములైన అర్థకామములు మోక్షానికి కారణమవుతాయి.

❖ నహీచ్ఛేయ మధర్మేణ శక్రత్వమపి లక్ష్మణ । (7-97-2)

❖ ద్వేష్యో భవత్యర్థ పరోహిలోకే (57-21-2)

భా:- కేవలం ధనమే ప్రధానంగా భావించి జీవించేవాడు, లోకంలో ద్వేషింపబడతాడు.

సం:- రాముడు వనవాసానికి వెళ్ళడం, సహించని లక్ష్మణుడు క్రుద్ధుడై, "మోహపాశబద్ధుడైన ఈ ముసలిరాజును, అతని పరివారాన్ని సంహరిస్తా"నని పలికినపుడు, రాముడాతనికి ధర్మస్వరూన్ని ఉపదేశించిన సందర్భమిది.

వ్యా:- ఇతరుల సొమ్ము తేరగా రాబట్టుకొని మూట కట్టుకోవాలని చూచే స్వార్థపరుడు ప్రజల మన్ననలను పొందలేడు. అందుకే, కైక నిందలపాలైంది.

❖ కామాత్మాతా ఖల్వపి న ప్రశస్తా (57-21-2)

భా:- కాముకుడు నిందార్హుడు అవుతాడు

వ్యా:- ధర్మ విరుద్ధమైన కాముకత్వము నిందార్హము. రావణుడు, సీతను నిర్బంధించి, వధింపబడ్డాడు.

❖ ధర్మోయత స్యాత్ తదుపక్రమేత (57-21-2)

భా:- ఏపని చెయ్యడం వలన ధర్మం-అనుష్టింపబడుతుందో అది మాత్రమే చేయాలి.

వ్యామ- అర్థకామములు ప్రతిజీవికి అవసరమే అయినా, అవి ధర్మ బద్ధమైనప్పుడే సేవింపబడాలి. ధర్మబద్ధములైన అర్థకామములను-అనుభవించేవాడు సమాజంలోని అందరిచేత ప్రశంసిపబడటమే కాక పునరావృత్తి రహితమైన మోక్ష పదవికి కూడా అర్హత సంపాదించుకొంటాడు. కేవలం అర్థ కామముల కొఱకే ప్రయత్నిస్తూ, వాని సంపాదనకై ధర్మమును భంగపరచుట రాక్షసత్వము, ధర్మబద్ధములైన అర్థకామములను అనుభవించుట మానవత్వము. ధర్మమును ఉపాసించుటకై అర్థకామములను ఉపేక్షించుట దైవీగుణ సంపద. ఇందుకు రామాయణమే ఒక ఉదాహరణ. రామ, రావణుల జీవితములు, తత్పర్యవసానములే తార్కాణములు. అందుకే "రామాదివత్ వర్తితవ్యం, నరావణాదివత్" అని, పెద్దలు దిశానిర్దేశం చేశారు.

## శుభాశుభ కర్మఫలములు

❖ శుభకృత్ శుభమాప్నోతి, పాపకృత్ పాప మశ్నుతే (26-114-6)

భా:- మంచి చేసిన వాడు మంచి, చెడు చేసినవాడు చెడు అనుభవిస్తాడు



❖ అధర్మాం జహి కాకుత్స్థ! ధర్మో హ్యస్యాం న విద్యతే (19-25-1)

భా:- ఓ రామా! అధర్మ స్వరూపిణియైన ఈ తాటకను సంహరింపుము.

సం:- విశ్వామిత్ర మహర్షి లోక కంటకురాలైన తాటకను వధింపుమని రాముని ఆదేశించుట.

అలాగే "నీవు చూస్తూ ఉండగానే ఈ సీతను చంపి, తిని, సవతిలేని దానినై నీతో హాయిగా విహరిస్తా"నని, రామునితో పలికి, ఆ పనికి పూనుకొంటున్న శూర్పణఖను రామాజ్ఞతో ముక్కుచెవులు ఖండించి లక్ష్మణుడు శిక్షించడంలోను ఇదే ధర్మ సూక్ష్మం ఇమిడి ఉంది.

## మనసుకు ముఖమే అద్దం

❖ బలాద్ధి వివృణో త్యేవ భావమంతర్గతం నృణామ్ (64-17-6)

భా:- మనసులో ఉన్న భావం ముఖంలో తప్పక కనబడుతుంది.

సం:- విభీషణ శరణాగతి ఘట్టము.

వ్యా:- ప్రాణుల మనసులో కలిగే ఆలోచనలకు ముఖం అద్దం పడుతుంది. ఎంతగా వేషం మార్చుకొన్నా సుఖదుఃఖాది భావనలు, భయాందోళన ఛాయలు ముఖంలో తారాడుతూనే ఉంటాయి. (కళాకారులు మాత్రం వీటన్నింటిని చక్కగా నటింప గలుగుతారు.)

సామాన్యంగా, ఒక వ్యక్తి శీలవంతుడా? నయవంచకుడా అన్నది విజ్ఞులు చూడగానే గుర్తించి, చెప్పగలగడం కూడా దీనివల్లనే సాధ్యపడుతుంది. సత్యగుణ ప్రధానుడు, సాధుశీలి, ధార్మికుడు అయిన విభీషణుని వ్యక్తిత్వాన్ని హనుమదాదులు ఈ విధంగానే నిర్ణయించారు.

## విజయరహస్యం

❖ మంత్ర మూలంహి విజయం (5-6-6)

భా:- ప్రణాళికా బద్ధమగు ఆలోచనా విధానము పైననే విజయం ఆధారపడి ఉంటుంది.

వ్యా:- ఏదైనా ఒక పని చేయ సంకల్పించినప్పుడు అది ఎలా చేయాలి? అన్న ప్రశ్న ఎదురౌతుంది. అందుకు ముందుగా దానికి సంబంధించిన వ్యక్తులతో

స్వార్థ జీవులు ఎందరో ఉంటారు. ఇట్టి వారిని గమనించి, దూరంగా ఉంచాలి, సర్వశ్రేయోదాయకమైన సజ్జన సాంగత్యమే చేయాలి.

## సత్సంగము

ముని పుంగవుడు, తపస్వి అయినవాడు వాల్మీకి. తపస్స్వాధ్యాయ నిరతుడు, వాగ్విదాం వరుడు అయిన వాడు నారదుడు. వీరిరువురి సమాగమమే ఒక సత్సంగము. ఇద్దరు మంచివారు ఒకచోట చేరితే, వారిమధ్యలో మంచిమాటలే వస్తాయి. ఇక్కడా అదే జరిగింది. తపస్సుచేతనే తెలియదగిన రామతత్త్వము లోకానికి సులభంగా ప్రకటిత మగుటయే వారి సత్సంగమునకు ఫలము. రామాయణంలో "అహంవేద్మి మహాత్మానం, రామం సత్య పరాక్రమం, వశిష్ఠోఽపి మహాతేజా, యేచాన్యే తపసి స్థితాః" (14-19-1) "నాకు, వశిష్ఠునకు, తపోనిష్ఠులగు తక్కిన మునులకు కూడా రాముని మాహాత్మ్యము సత్య పరాక్రమము తెలియు'నన్న విశ్వామిత్రుని వచనములు ఈ విషయాన్నే విశేషంగా వివరిస్తున్నాయి.

దుర్వ్యసనాలతో కాలాన్ని వ్యర్థం చేయకుండా, మంచి వారందరు ఒక చోట కలిసి, క్రమశిక్షణతో ఆ సభ్యులు, తమలోని ఆధ్యాత్మికశక్తిని వికసింప చేసుకొనడం, సాంఘిక సేవలో పాల్గొనడం వంటివి ఈసత్సంగ ప్రయోజనాలుగా గుర్తింపగలం. జాతికి దేశానికి ఇవి ఎంతో మేలు చేస్తాయి.

## స్త్రీని గౌరవించాలి

❖ న హి స్త్రీ షు మహాత్మానః క్వచి త్కుర్వంతి దారుణమ్ (36-33-4)

భా:- మహాత్ములగువారు స్త్రీల యెడ ఎప్పుడు దారుణంగా ప్రవర్తింపరు.

వ్యా:- ప్రేమకు, అభిమానానికి, త్యాగానికి సహనానికి ప్రతీకలైన స్త్రీలను గౌరవించినప్పుడే కుటుంబం, సమాజం దేశం బాగుపడుతుంది, ఆ జాతి ప్రతిష్ఠ పెరుగుతుంది. సౌజన్యము, సౌకుమార్యము గల వారి యెడ అమానుషంగా ప్రవర్తిస్తూ, అక్రమాలకు పాల్పడేవారు ఎన్నడూ ఆనందాన్ని పొందలేరు. అభ్యుదయాన్ని సాధించలేరు. ఒకప్పుడు ఆ స్త్రీయే మానవత్వాన్ని మఱచి, క్రూర స్వభావంతో సమాజ విధ్వంసకర శక్తిగా మారి అధర్మంగా ప్రవర్తించినప్పుడు ఆమె నిర్దాక్షిణ్యంగా వధార్హురాలే అవుతుందని రామాయణం నిరూపించింది.



వ్యా:- భారతీయులు, కర్మ సిద్ధాంతాన్ని విశ్వసిస్తారు. అది మూడు విధాలు. 1) సంచితము, 2) ఆగామి 3) ప్రారబ్ధము. శుభ-అశుభ కర్మఫలములే జీవుల సుఖ దుఃఖములుగా పరిణమిస్తాయి. "చేసుకొన్న వారికి చేసుకొన్నంత మహాదేవ" అన్నది ఈ విషయంలో పెద్దలు చెప్పేనానుడి. అది నిజం. త్రికరణములతో (మనో, వాక్, కాయములు) శుభమునే ఆచరిస్తే శుభ ఫలములనే పొందుతాడు.

❖ ధర్మేణ చరతాం తేషాం తథా ధర్మఫలం భవేత్ (20-23-6)

భా:- ధర్మ మార్గమున చరించు వారికి తగిన విధంగా ధర్మఫలమే లభిస్తుంది. అలాగే

❖ అవశ్యం లభతే కర్మఫలం కర్మణః (3-29-3)

భా:- పాపాత్ముడు తన కర్మఫలమును తప్పక పొందుతాడు.

వ్యా:- "అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"

మంచిగాని, చెడుగాని చేసింది అనుభవింపక తప్పదని తెలిసి, తెలివితో మంచిగా ప్రవర్తించటం, ప్రాప్త మైన కర్మఫలాన్ని నిపుణతతో అనుభవించడం, జ్ఞానయోగముల ద్వారా వాసనాసంచయాన్ని రూపు మాపటం, సుజనులనుసరించే పద్ధతి. అడవిలో ఉన్నా, అంతఃపురంలో దాగినా ఈ కర్మ ఫలం తొలగిపోదు. కొన్ని సందర్భాలలో జీవులు అధికంగా చేసే పుణ్య, పాప ఫలములు ఎప్పుడో కాకుండా ఈ జన్మలోనే అనుభవించడం జరుగుతుందని ధర్మశాస్త్రం చెబుతోంది. "అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫలమశ్నుతే" మన చుట్టూ, మన లోపల తఱచి చూస్తే, గుర్తించగలిగితే, ఆందుకు ఎన్నో నిదర్శనాలు, నిర్భాగ్య జీవితాలు దర్శనమిస్తాయి. ఒకప్పుడు అన్నీ ఉన్నా అనుభవించ లేక పోవటం, కర్మఫలం కాక మరేమిటి? నిరుపేదలకు అనుకోకుండా మహదైశ్వర్యం లభించటం కూడా అంతే.

❖ న మిథ్యా ఋషి భాషితమ్। (11-60-6)

భా:- ఋషి వాక్కు వ్యర్థంకాదు

వ్యా:- రాగ ద్వేషములకు రెండింటికీ అతీతంగా లోకహితంకోరే ధర్మాత్ముడే ఋషి. ద్రష్ట అయిన అతని వాక్కు విశ్వశ్రేయస్సాధనము. అది ఎన్నడూ వ్యర్థంకాదు.

## కృతజ్ఞత

❖ కృతేచ ప్రతి కర్తవ్య మేష ధర్మ స్సనాతనః (26-114-6)

భా:- ఉపకారికి ప్రత్యుపకారము చేయుట శాశ్వతమైన ధర్మము.

సం:- రామ కార్యార్థియై లంకకుపోవు హనుమంతునకు సేవలందించి సాయపడమని సముద్రుడు పోత్సహింపగా, మైనాకుడు ప్రీతితో వాయుసుతుడైన హనుమకు కృతజ్ఞత ప్రకటించుట సందర్భము.

వ్యా:- ప్రకృతిలో చెట్లు చేమలు, పరిమళాల్ని వెదజల్లేపూలను, రుచికరములైన ఫలాలను ప్రసాదించడం, పోషకవర్గం యెడ వాటికి గల కృతజ్ఞతను వెల్లడిస్తుంది. పశుపక్ష్యాదులు సహితం యాజమాన్య రక్షణకై, అవసరమైతే ప్రాణపరిత్యాగానికైనా సిద్ధపడటం గమనించగలం.

మనం కూడా ఎవరైనా అగ్గిపుల్ల ఇస్తే, వక్కపొడిపెడితే, వేడి తేనీరు ఇప్పిస్తే, ఫలహారం పెట్టిస్తే వారికి కృతజ్ఞతా పూర్వకంగా థాంక్స్ చెప్తూ నమస్కరిస్తాం. జీతం ఇస్తే జీవితాంతం ఊడిగం చేస్తాం. అటువంటిది జీవితాన్ని ఇచ్చిన భగవంతునికి, భక్తితో ఏం చేయగలుగుతున్నాం. ఇక ఈ మానవజాతి మహోన్నతికి కారణమైన జ్ఞాన విజ్ఞానములను ప్రసాదించిన ప్రజ్ఞావంతులగు ఋషిపుంగవులకు మనమెంత ఋణపడి ఉన్నాం? అని ఆలోచించినప్పుడు మనసు జాగృతమై మన కర్తవ్యం కళ్ళముందు కదులాడుతుంది. వారు చెప్పింది శ్రద్ధగా విని ఆచరించాలి.

కని, పెంచి, పోషించిన తల్లిదండ్రులు తక్కిన కుటుంబ సభ్యులు, బంధు మిత్రులు, గురువులు, సహాధ్యాయులు, సమకాలికులు వీరందరి సహకారం వలననే అభ్యుదయం సాధించి, మనమింత వారము కాగలిగామని గుర్తించుకొని ఈ సమాజంయెడ, ఈసంస్కృతియెడ కృతజ్ఞతతో మెలగుతూ, నిలవటానికి చోటిచ్చి తినడానికి పంటనిచ్చి కాపాడే ఈ పుడమితల్లి యెడ భక్తి కలిగి బ్రతకటం మన బాధ్యత. అదే మనం ప్రకటించే కృతజ్ఞత. దేశభక్తి.

ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉండే వారికైనా ఏ భాష మాట్లాడేవారికైనా ఇది కర్తవ్యమే. ఇట్టి శాశ్వత ధర్మముల నెన్నింటినో భారతీయ సాహిత్యం ప్రతిపాదించింది. తద్వారా విశ్వ శ్రేయస్సుకు దోహదం చేసింది.



## పుణ్య కర్మము

❖ సమానయ పతిం పత్న్యా కురు కల్యాణ ముత్తమమ్। (31-32-5)

భా:- భార్యా భర్తలను కలిపి పుణ్యము కట్టుకొనుము

సం:- ఇది లంకలో సీత హనుమంతుని కోరిన కోరిక

వ్యా:- లోకంలో "నూరు అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యమంటారు" పెద్దలు. ధర్మబద్ధమైన ఆ వివాహ విధిలో భగవంతుని సంకల్పమైన సృష్టికార్యం సక్రమంగా నిర్వహింపబడటమే విశేషమై ఉంటుంది. అందుకే భగవంతుడు ప్రాణులలో గల ధర్మ విరుద్ధంకాని కామమే తానని స్వయంగా గీతలో ప్రకటించాడు. 'ధర్మావిరుద్ధోకామోస్మి భరతర్షభ!' అలాగే భార్యాభర్తలు ఏ కారణం చేతనైనా వియోగాన్ని అనుభవిస్తున్నప్పుడు వారిని ఒక చోట చేర్చి ఆ దాంపత్యాన్ని నిలబెట్టటానికి చేసే ప్రయత్నం కూడా 'పుణ్యకర్మము' అనేది రామాయణ సందేశంగా గ్రహింపవచ్చు.

ఈ సందర్భాన్ని సంప్రదాయజ్ఞులైన పెద్దలు అధ్యాత్మసుందరంగా కూడా సమన్వయం చేశారు. పరమాత్మతో వియోగాన్ని పొంది పరితపిస్తున్న జీవాత్మకు తిరిగి సద్గురువు ద్వారా కలిగే పరమాత్మ యోగమే సీతారాముల పునస్సమాగమమని, అందుకు హనుమంతుడు చేసిన ప్రయత్నమే గురుకృపయని వారి సంభావన.

## చెప్పుడు మాటలు వినరాదు

సమాజంలో కొందఱు దంపతుల నడుమ వివాదాలు కల్పించి కుటుంబాలు విడిపోయేలా చేసి, వారు ప్రయోజనం పొందాలని చూస్తారు. అది పాప కృత్యమని భావింపక పోగా, కేవలం తమకు వారిపై గల అభిమానంగానే ప్రకటిస్తారు. ఆ విధంగానే ఎదుటివారిని నమ్మిస్తారు. రామాయణంలో మంథర తన మాయమాటలతో దశరథుని పచ్చని సంసారంలో చిచ్చు పెట్టి గందరగోళం సృష్టించింది. అందుకే వాల్మీకి ఆమెను 'పాపదర్శని' అని నిందించాడు. "మంథరా పాపదర్శనీ" (13-7-2) ఆమె చెప్పుడు మాటలు విని మోసపోయిన కైక, అనర్థ పరంపరకు గుఱియై నిందలపాలైంది. సమాజంలో మంథర వంటి దుష్టస్వభావులు

సం:- సీతా సందర్శనం తర్వాత హనుమంతుడు రావణునికి బుద్ధిచెప్పటానికి తగిన యోజన చెయ్యటం సందర్భం.

వ్యా:- ఏ పనైనా ఒక లక్ష్యంతో ప్రారంభిస్తాం, ఆ లక్ష్యం సిద్ధించే వరకు విశ్రమించకూడదు. ప్రతి చిన్న పని కూడ చాలా శ్రద్ధతో చేయాలి. అటువంటిది ఏ మహత్కార్యమో తల పెట్టినప్పుడు వేరే చెప్పవలసిందేముంది? మరిన్ని విశేష ప్రయత్నాలు చేసి ఆ పని సాధించాలి. అందుకు ముందుగా ఏమి చేయాలో మహర్షి అనుభవ పూర్వకంగా ఇలా చెప్పారు.

❖ యోహ్యంర్థం బహుధా వేద స సమర్థోఽర్థ సాధనే (6-41-5)

భా:- "ఎవరు ఒక సమస్యను అన్ని కోణాల నుండి సమగ్రంగా చర్చించి, ఆకళింపు చేసుకుంటారో, వారే దానిని సాధించడానికి సమర్థులవుతారు."

## దెబ్బకు దెబ్బ

❖ న సామ రక్షస్సు గుణాయ కల్పతే. (3-41-5)

భా:- రాక్షసుల యందు సామోపాయము ప్రయోగించుట, మంచితనము ప్రకటించుట సరికాదు.

సం:- హనుమంతుడు దుష్టులగు రాక్షసులకు దండోపాయము చేతనే బుద్ధి చెప్పవలయునని సంకల్పించుట.

వ్యా:- పనిని సాధించటానికి ఏదైనా ఉపాయం కావాలి. సామ, దాన, భేద' దండములు అనేవి నాలుగు ఉపాయాలు. సందర్భాన్ని బట్టి వాటినిప్రయోగించటం లోకంలో పరిపాటి. ఇందులో కొన్ని, కొన్ని సమయాలలోనే ప్రయోగించాలి. ఋజు స్వభావయుతులగు వారి యందు మాత్రమే వినియోగింప దగిన సామోపాయము క్రూర స్వభావులగు రాక్షసుల యెడ కుదరదు. ఆ విధంగానే వారు సంపన్నులగుట వలన దానము, బలదర్పితులగుట వలన భేదము, ప్రస్తుతమున ప్రయోగింపరాదు.

"ముల్లును ముల్లుతోనే తీయటం, వజ్రాన్ని వజ్రంతోనే కోయటం అనేది పద్ధతి. అలాగే మూర్ఖుడికి తగిన పద్ధతిలోనే బుద్ధిచెప్పాలి గాని మృదువుగా నచ్చ చెప్పాలను కోవటం తగదు. దీనినే "శఠే శాఠ్యం సమాచరేత్" అన్నారు.



❖ ఉపకారేణ వీరోహి ప్రతికారేణ యుజ్యతే (64-28-4)

భా:- కృత మెఱిగిన సజ్జనులు ప్రత్యుపకార సమర్థులవుతారు.

కృతజ్ఞత లేకపోతేనో, ప్రత్యుపకారం చేయకపోతేనో వచ్చే ఇబ్బంది ఏమిటి? దీనికి సమాధానంగా వాల్మీకి ఈ క్రింది విధంగా చెప్పాడు.

❖ అకృతజ్ఞోఽ ప్రతికృతో హంతి సత్త్వవతాం మనః । (64-28-4)

భా:- "సజ్జనులకది మనక్షోభాన్ని కల్గిస్తుంది" అట్టిది ఎవరికి, ఎప్పుడూ, యోగ క్షేమ దాయకం కాదు.

❖ కృతఘ్నేనాస్తి నిష్కృతిః। (12-34-4)

భా:- కృతఘ్నుతకు ప్రాయశ్చిత్తము లేదు.

వ్యా:- చేసిన మేలు మరచిపోవడాన్ని 'కృతఘ్నుత' అంటారు. గోవును చంపడం, మద్యం సేవించడం, దొంగిలించడం, వ్రతభంగం చేయడం, మొదలైనవి కాని పనులే, అయినా పొరపాటున జరిగితే వాటికి ఒక ప్రాయశ్చిత్తమనేది విధించారు. కృతఘ్నుతకు మాత్రం నిష్కృతిలేదు. తప్పించుకునేందుకు ఏవిధమైన అవకాశంలేదు. అది అంత ఘోరమైన నేరమన్నమాట.

స్నేహితుల సహాయాన్ని పొంది తాను కృతార్థుడై తిరిగి సకాలంలో వారికి సాయం చేయనివాడు (కృతఘ్నుడు) మరణిస్తే వాని శవాన్ని కాకులు, గ్రద్దలు, రాబందులు కూడా ముట్టవు.

కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం నభవంతి యే।
తాన్మృతా నపి క్రవ్యాదాః కృతఘ్నాన్నోప భుంజతే (73-30-4)

## ఆత్మ సమర్పణ భావం

❖ ఏకస్య మరణం మేఽస్తు మాభూత్ సర్వవినాశనమ్ (9-105-7)

భా:- నేను ఒక్కడిని మరణించినా ఫరవాలేదు. తోటి వారంతా సుఖంగా ఉంటే చాలు.

సం:- రామ రాజ్యంలో లక్ష్మణుడు, రాజుకోసం, రాష్ట్ర ప్రజలకోసం, ఆత్మ సమర్పణకు సిద్ధపడి తీసుకొన్న నిర్ణయమిది.

వ్యా:- స్వార్ధ పూరితమైన ఈ సమాజ వాతావరణంలో తన ఉనికి కోసం,

తన సుఖం కోసం, తన పేరు, ప్రఖ్యాతుల కోసం ప్రయత్నిస్తూ, తనపై గల బరువు బాధ్యతలను మరచి, కర్తవ్యమును విడచి, ప్రవర్తించడమే కాదు, సంస్కృతిని, సమాజాన్ని కూడా పణంగా పెట్టగల ప్రబుద్ధులెందరో ఈ నాడు దర్శనమిస్తారు. అటువంటి వారికి ఈ లోకం ఎటుపోయినా బాధలేదు. తాము మాత్రము క్షేమంగా ఉంటేచాలు. సాంఘికంగా జీవిస్తున్న తమకు కష్టసుఖములు ఈ సమాజంతోనే ముడిపడి ఉన్నాయని భావించరు. అట్టి వారికి అత్యున్నతమైన లక్ష్మణుని ఆత్మత్యాగం కనువిప్పు కల్గిస్తుంది. ఆదర్శంగా నిలుస్తుంది.

త్యాగం ద్వారానే అమృతత్త్వం సిద్ధిస్తుందని ఉపనిషత్తులు ప్రవచిస్తున్నాయి. ''న కర్మణా నప్రజయా నధనేనచ త్యాగే నే కేనామృతత్వమానసుః'' (బృహదారణ్యకం) ఈ వేదార్థాన్ని వివరించటమే రామకథ లక్ష్యం.

జాతీయ ప్రయోజనాల కొఱకు అసువులను సైతం అర్పించిన అమరజీవులకు ఎందరికో స్ఫూర్తినివ్వడంలో రామాయణం సుసంపన్నమయిందని భావించవచ్చు. **త్యాగానికున్న చరిత్ర భోగానికి లేదు.**

## శోకమే శత్రువు

యే శోక మనువర్తంతే న తేషాం విద్యతే సుఖమ్ (12-7-4)

భా:- ధైర్యమును విడిచి నిత్యము దుఃఖించువారికి సుఖమే లేదు.

ఎప్పుడు నిరుత్సాహంతో, నిస్పృహతో ఉంటూ శోకంచేత ఆకులమైన చిత్తంగల వారికి ధైర్యము, విద్య, విజ్ఞానములే కాక సర్వమూ నశిస్తాయి. అట్టి వారు కర్తవ్య మూఢులవుతారు. నిజానికి లోకంలో శోకం (దుఃఖం)తో సమానమైన శత్రువే లేదు.

శోకో నాశయతే ధైర్యం, శోకో నాశయతే శ్రుతమ్।
శోకో నాశయతే సర్వం, నాస్తిశోక సమో రిపుః (15-62-20)

❖ శోక స్సర్వార్థ నాశనః (16-2-6)

భా:- శోకము సకల ప్రయోజనాలను నశింపజేస్తుంది.

❖ పురుషస్య హి లోకేస్మిన్ శోక శ్శౌర్యాపకర్షణః (14-2-6)

భా:- శోక మీ లోకమున మానవులకు శౌర్యమును క్షీణింపజేస్తుంది.



బలమైనదో అది ఎంతటి వారికీ ఏ విధంగా దాటరానిదో తెలుస్తుంది'. ఇంక ఇతరుల సంగతి వేరే చెప్పాలా? అది ఎంతపనైనా చేయగల్గుతుంది.

❖ ఐశ్వర్యేవా సువిస్తీర్ణే, వ్యసనేవా సుదారుణే
రజ్జ్వేవ పురుషం బధ్వా కృతాంతః పరికర్షతి॥ (3-37-5)

భా:- బలీయమగు ఆ విధి, ప్రాణులు విశేషభోగములలో మునిగి తేలుతున్నా, మిక్కిలి దారుణములైన కష్టములు అనుభవిస్తున్నా, ఇవి ఏవీ లెక్కచేయకుండానే నిర్దాక్షిణ్యంగా కట్టిపడేసి తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తుంది.

వ్యా:- ఓడలను బండ్లుగాను, బండ్లను ఓడలుగాను చేసి నడిపించేది విధి ఒక్కటే. దానికి తిరుగులేదు. ఎన్నో కష్టాలలో ఉన్నాను. కొంతకాలం కనికరించమన్నా, ఈ సుఖాలు పూర్తిగా అనుభవించేంత వరకు వేచి చూడమన్నా, విధి వినిపించుకోకుండానే, చేయ దలచుకొన్నది చేసి తీరుతుంది. దాని ముందు పౌరుషం నిలబడి ఎదురించి గెలువలేదు. క్షణం చిత్తం, క్షణం విత్తం, క్షణం జీవితమానయోః। యమస్య కరుణానాస్తి, ధర్మస్య త్వరితాగతిః॥. అంటూ ధర్మాచరణమునకు త్వరపడండని హెచ్చరించారు.

## స్వభావము

❖ స్వభావో దురతిక్రమః (11-36-6)

భా:- దుష్టుల స్వభావం ఎన్నటికి మారదు.

సం:- మాల్యవంతుడు రావణునకు సీత నప్పగించి రామునితో సంధి చేసుకొమ్మని హితము చెప్పగా రావణుడు సమాధాన మొసగుట ప్రస్తుతాంశము.

వ్యా:- ప్రపంచంలో తోచే ఈ వైవిధ్యం భిన్న స్వభావం చేతనే ఏర్పడుతుంది. కొందరు రెండుగా చీల్చబడటానికైనా ఇష్టపడతారు గాని, తాము చేస్తున్నది మంచిది కాదని తెలిసి కూడ ఆ పని మానలేరు, అది వారి బలహీనత. రావణుడు కూడ అట్టి కోవకు చెందినవాడే. అందుకే అతనిని తెలిసిన మూర్ఖుడని పెద్దలు అభివర్ణించారు.

## పని సాధించే తీరు

❖ నహ్యేక స్సాధకోహేతు స్స్వల్ప స్యాపీహ కర్మణః (6-41-5)

భా:- లోకంలో ఏ కొద్దిపాటి పని తలపెట్టినా దాన్ని సాధించేందుకు అనేక విధములైన ప్రయత్నాలు చేయాలి.

క్షమాదానం క్షమాయజ్ఞః క్షమాసత్యం హి పుత్రికాః।
క్షమాయశః క్షమాధర్మః క్షమయా విష్టితం జగత్। (8-33-1)

ఆవేశంలో ఎవరైనా తనను పరుషంగా మాట్లడి, నిందించినా దురుసుగా ప్రత్యుత్తర మీయని ఈ క్షమాగుణం చేతనే రాముడు లోకాభి రాముడైనాడు. అందుకే అయోధ్యావాసులైన ప్రజలందరూ ప్రశాంతాత్ముడు మృదు పూర్వభాషి అయిన రాముని వేనోళ్ళ ప్రశంసించారు.

స తు నిత్యం ప్రశాంతాత్మా మృదు పూర్వంచ భాషతే
ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతి పద్యతే। (10-1-2)

ఉత్తముడగు అట్టి రాముని వారు నిత్యం సందర్శించకుండా ఉండలేక పోయారు. అలా జరిగితే ఆ దురదృష్టానికి లోక నిందతోబాటు తమను తామే నిరసించుకొన్నారు. 'యశ్చరామం న పశ్యేత్తు, యంచరామో నపశ్యతి, నిందితస్సభవేల్లోకే, స్వాత్మాప్యేనం విగర్హతే' (14-17-2)

## మోహము

❖ మోహోఽ ప్యున్మాద లక్షణః (24-34-5)

భా:- మోహము కూడా ఉన్మాద లక్షణమే.

వ్యా:- ఏ విషయంలోనైనా విపరీతమైన వ్యామోహం పెంచుకొంటే అది ఉన్మాదం (పిచ్చి)గా పరిణమిస్తుంది. దానివల్ల యథార్థాన్ని గుర్తించలేకపోవడం జరుగుతుంది. పెక్కు అనర్థాలు కూడ సంభవిస్తాయి. రావణ వినాశనానికి ఈ వ్యామోహమే కారణం. ఆ వ్యామోహంవల్లనే అతడు (తనవారు చెప్పిన) మంచి గ్రహించలేక పోయాడు.

## విధి బలీయము

❖ కాలోఽ హి దురతిక్రమః (3-16-5)

భా:- కాల మెంతటి వారికిని దాటరానిది.

సం:- లంకలో రాక్షసీ బృందం మధ్యలో బందీగా ఉంచబడిన సీతను చూచి హనుమంతుడిలా బాధపడ్డాడు.

వ్యా:- పెద్దలయందు వినయం కల్గినది, మాన్యురాలు, రాముని ప్రియపత్నియు అయిన సీతయే ఇంతటి కష్టములపాలైనపుడు, 'కాలమెంత



❖ శోక పర్యాకు లాత్మనః సర్వార్థా వ్యవసీదంతి, వ్యసనం చాధిగచ్ఛతి (6-2-6)

భా:- దీనుడై శోకించు వానికి సర్వార్థములు నశించును. ఆపదలు కూడ సంభవించును. అందువల్ల

❖ వర్జనీ యా హి శోకాశ్చ సర్వావస్థాసు ధీమతా (39-105-2)

భా:- ధీమంతుడైనవాడు ఎట్టి పరిస్థితులలోను, వివేకంతో దుఃఖాన్ని దూరంగా నెట్టివేయాలి.

❖ ధృతిమాన్ నావసీదతి. (9-7-4)

భా:- ధీరుడెన్నడూ నశింపడు.

## ఉత్సాహమే సంపద

❖ అనిర్వేద శ్రియో మూలమ్। (9-7-4)

భా:- ఉత్సాహమే సంపదలకు మూలము.

సం।। హనుమంతుడు సీతకై లంకంతా గాలించి ఆమెను చూడలేక పోవడంతో నిర్విణ్ణుడై కొద్దిసేపు విచారించి, వివేకంతో తిరిగి తన కర్తవ్యాన్ని గుర్తుచేసుకొంటూ ఉత్సాహమే ఎల్లపుడు కోరదగిందని, అదే పరమ సుఖాన్ని ప్రసాదిస్తుందని, ఎవ్వరేపనిలో కృత కృత్యులైనా అందుకు ఉత్సాహమే కారణమని సంభావించాడు. ఆ ఉత్సాహంతోనే వెదికి సీతను తుదకు అశోకవనంలో సందర్శించాడు.

అనిర్వేద శ్రియో మూల, మనిర్వేదః పరం సుఖమ్।
అనిర్వేదో హి సతతం, సర్వార్థేషు ప్రవర్తకః।
కరోతి సఫలం జంతోః, కర్మ య త్తత్కరోతిసః।
తస్మా దనిర్వేద కృతం, యత్నం చేష్టేహముత్తమమ్।।(10,11-12-3)

వ్యా:- ఏ పని చెయ్యాలన్నా ముందు కొంత భయం కలుగుతుంది. ఇది ఎలా చేయగలమా! అని కలవరపడతాం. దాన్నే కృత్యాద్యవస్థ అంటారు. ఆ పిరికి తనంతోనే కొందరు ఏ పని చేయడానికి ముందుకురాలేరు. ప్రారంభించి ఏవో కొన్ని ఇబ్బందులు రావటంవల్ల కొంతమంది మానుకొంటారు. మరికొందరు చేపట్టిన పని నెరవేరేదాకా ప్రయత్నం సాగిస్తారు. వారే ఉత్తములు. దీని కంతటికి

కారణం ఉత్సాహమే. ఉత్సాహవంతులు ధైర్యంతో సాహసం చేస్తారు. విజయలక్ష్మి వారిని వరిస్తుంది.

❖ సోత్సాహస్యాస్తి లోకేఽస్మిన్ నకించి దపి దుర్లభమ్। (122-1-4)

భా:- ఉత్సాహవంతునకు సాధించలేనిది ఈ లోకంలో ఏదీలేదు.

## ప్రతిజ్ఞానిర్వహణమే ధర్మము

❖ నహి ప్రతిజ్ఞాం కుర్వన్తి వితథాం సాధవోఽనఘ! (43-102-6)

భా:- సత్పురుషులు వ్యర్థమగు ప్రతిజ్ఞలు చేయరు.

వ్యా:- ప్రతిన చేయడం చాలా సులభం. దాన్ని నెరవేర్చటమే చాలా కష్టం. ఆడంబరంగా ప్రగల్భాలు పలకటం, అవసరం వచ్చేటప్పటికి జావకారి పోవటం, అల్పుల లక్షణం, సజ్జనులెన్నడూ అట్టి త్రోవ త్రొక్కరు.

❖ లక్ష్మీశ్చంద్రాద పేయాద్వా, హిమవాన్వా, హిమం త్యజేత్।
అతీయా త్సాగరో వేలాం, న ప్రతిజ్ఞా మహం పితుః। (18-112-2)

భా:- చంద్రుడు కాంతిని కోల్పోయినా, హిమవంతుడు చల్లదనాన్ని విడిచిపెట్టినా, సముద్రుడు చెలియలికట్ట దాటినా, నేను మాత్రం నా తండ్రిమాట జవదాటను.

సం॥ అరణ్యవాసం మానేసి, అయోధ్యకు వచ్చి, రాజ్య పట్టాభిషేకం చేసుకొని ప్రజల పాలింపుమని వేడ వచ్చిన భరతాదులకు చిత్రకూటంలో రాముడు చెప్పిన మాటలివి.

ప్రతిజ్ఞానిర్వహణమే ధర్మం కావున "సాధువులైన మునిజనాన్ని కాపాడటానికి దండకారణ్యంలో రాక్షస సంహారం చేస్తా"నని, మొదట చేసిన ప్రతిజ్ఞ తాను బ్రతికిఉండగా ఎన్నటికి విడువబోనని, సత్యమే తనకిష్టమని రాముడు సీతకు స్పష్టపరచాడు. అందుకై ఎంతటి త్యాగానికైనా సిద్ధపడ్డాడు.

సంశ్రుత్యచ నశక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్।
మునీనా మన్యథా కర్తుం సత్య మిష్టంహి మే సదా॥ (18-10-3)

ఆ ప్రతిజ్ఞాపాలనంలో ఎన్ని కష్టాలు ఎదురైనా ధైర్యంతో నిలబడి పోరాడి



ధర్మసంపాదనలో ఆసక్తికల్గి ఉండాలి. అట్టి "ధర్మాత్ములకు లోకంలో దుర్లభమన్నది లేనే లేద"ని వాల్మీకి ఋషి ఈ విధంగా ప్రతిపాదించాడు.

నహి ధర్మాభిరక్తానాం లోకే కించన దుర్లభమ్। (33-10-7)

## అహంకారము

❖ ఐశ్వర్య మదమత్తోహి సర్వోఽహమితి మన్యతే । (17-64-3)

భా:- ధనాధికార మదమత్తులైనవారు గర్వంతో తమనుతామే సర్వోత్తములుగ భావిస్తారు. ఇతరుల మాట వినరు, పాటించరు.

సం:- సహ యాత్రికులగు వానరులు అంగదుని వినయమును, సౌశీల్యమును ప్రశంసిస్తూ "యువరాజువై యుండి, ఇంతటి ఔదార్యమును ప్రకటించిన నీవు, అందరివంటి వాడవుకావు. అధికార సంపదలచే గర్వితులైన ఇతరులు నీవలె తోటి వారి మాట పాటింపరు" అని మెచ్చుకొన్నారు.

వ్యా:- కష్టంలో ఉన్నప్పుడే దేవుడు కనబడతాడు. స్నేహితుల అండదండలు ప్రోత్సాహవచనములు, బంధువుల ఆత్మీయత కావల్సివస్తాయి. ఏరు దాటిన తరువాత తెప్ప తగలేసినట్లు సంపదలు సంప్రాప్తమైనప్పుడు ఈ సమస్తాన్నీ మరచిపోయి అన్నీ నేనే సాధించానని అహంకార పడడం జరుగుతుంది. అజ్ఞానజనితమైన ఈ ఆలోచనా ధోరణి, ఆ వ్యక్తులను అధోగతిపాలు చేస్తుంది.

## క్షమయే అలంకారము

❖ అలంకారోఽహి నారీణాం క్షమాతు పురుషస్యవా (6-33-1)

భా:- స్త్రీ పురుషుల కెవ్వరికైనను క్షమ(ఓర్పు)యే అలంకారము.

సం:- కుశనాభుడు వాయువునకు ప్రతిశాప మీయని తన కుమార్తెల క్షమాగుణములను ప్రశంసించిన ఘట్టము.

వ్యా:- క్షమ అంటే ఇతరులు చేసిన అపరాధాన్ని సహించగల స్వభావమని అర్థము. క్షమయే దానము, యజ్ఞము, సత్యము, యశము, ధర్మము. ఈ దానధర్మాదుల చేత ఏ ఫలమైతే కలుగుతుందో "క్షమా" గుణము చేతను అట్టి ఉత్తమ ఫలమే సిద్ధిస్తుంది. ఇంతెందుకు చరాచర జగత్తంతా కూడ ఈ క్షమాగుణం చేతనే కాపాడబడుతోంది.

ఉన్నామండీ” అని సమాధానం చెప్తారు. కానీ ఈసన్నివేశాన్ని వర్ణిస్తూ, ఒక కవి చమత్కారంగా “మనకు కుశల మెక్కడిదండి? రోజురోజుకు అయుర్దాయం క్షీణిస్తూ ఉంటే” అని అంటాడు. అది నిజమేకదా!

లోకః పృచ్ఛతి సద్వార్తాం, శరీరే కుశలం తవ?
కుతః కుశల మస్మాకం, ఆయు ర్యాతి దినే దినే॥

ఒకడు తనకు 40సం॥ వచ్చాయని అనుకొంటాడే కాని ఆయుర్ధాయంలో 40సం॥లు గడిచిపోయాయని భావించడు. ఇదే లోకం యొక్క అజ్ఞానము. “లోకంలో వింతైన విషయమేమి”టని అడిగిన యక్షుని ప్రశ్నకు సమాధానంగా ధర్మరాజు “నిత్యం ఎంతో మంది మన కళ్ళముందే ఈ లోకం విడిచిపోవటం చూస్తున్నా, మనం మాత్రం శాశ్వతంగా ఉంటామని భావించటమే వింతలలోకెల్లా వింత అని వివరించాడు (భారతం)

❖ సత్య ధర్మాభియుక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్। (46-34-6)

భా:- సత్యధర్మములను పాలించువారికి మృత్యువువలన భయంలేదు.

వ్యా:- జీవితాంతము శాశ్వతములైన సత్యధర్మములయందు అనురక్తులై ఆచరించినవారికి, బ్రహ్మజ్ఞానమేర్పడి, పరిణామరూపమైన మృత్యువు (శరీరపతనం) వలన కలుగు దుఃఖము తొలగిపోతుంది. బ్రహ్మాద్వైత భావన సిద్ధించి ముక్తులయి, అమృతత్వాన్ని పొందగల్గుతారు.

❖ చలం హి యౌవనమ్। (17-32-1)

భా:- యౌవనము చంచలమైనది.

వ్యా:- వయసులో ఉన్నప్పుడు అందరూ అంతో ఇంతో అందంగానే కనబడతారు. లోకంలో కొందరు తమకు తామే తమ అంతటి అందగాళ్ళులేరని కూడ అహంకారపడతారు. క్రమేణ శరీర ధర్మాన్ని అనుసరించి కొంతకాలానికి వృద్ధాప్యం సంభవిస్తుంది. ఆ అందం క్షీణిస్తుంది. అందరు చూసి పరిహసిస్తారు. దగ్గరకు రావడానికి అసహ్యించుకుంటారు. అప్పుడు తాము యౌవనగర్వంతో చేసిన దుశ్చేష్టలకు సిగ్గుపడవలసివస్తుంది. అందువల్ల చంచలమైన యౌవనాన్ని నమ్మి విషయోపభోగములతో కాలం వ్యర్థపుచ్చక సత్ప్రవర్తనులై మెలగాలి.



విజయాన్నిసాధించాడు. ఆ రాముని ధర్మాచరణమే జగత్కళ్యాణదాయకమై విలసిల్లింది.

## పరదారాభిలాష పనికిరాదు

❖ పరదారాభి మర్శాత్ నాన్య త్పాపతరం మహత్ (30-38-3)

భా:- పరస్త్రీ గమనము కంటే మిక్కిలి పాపములేదు.

సం॥ సీతాపహరణోద్యమంలో తనకు తోడ్పడమని అడిగిన రావణునకు మారీచుడు ఇలా బుద్ధిచెప్పాడు.

వ్యా:- మనస్సులో ఆవిధమైన పాపభావం రావటం వల్ల ఆలోచనా కాలుష్యం ఏర్పడి అనారోగ్య లక్షణం ప్రబలుతుంది. ఆందోళన ఎక్కువ అవుతుంది. రక్తపోటు (బి.పి.) గుండెదడ మొదలైన వ్యాధులు వస్తాయి. అందువల్ల ఆ పాపము జోలికే పోరాదన్నది పెద్దల సందేశంలోని పరమార్థం.

ఇంక, “ఈ పరదారాభిలాష వల్ల యశస్సు, ఆయుస్సు నశిస్తుంది. ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి. పాపహేతువైన ఈ దురుద్దేశం మానుకోమ”ని రావణునకు విభీషణుడీవిధంగా వివరించాడు.

❖ అయశస్య, మనాయుష్యం, పరదారాభి మర్శనమ్।
అర్థ క్షయకరం, ఘోరం, పాపస్యచ పునర్భవమ్॥ (15-9-6)

తనతో దుర్భాషలాడుతున్న రావణునితో సీత, “నీ భార్య ఏ విధంగా రక్షింపబడాలని నీవు కోరుకొంటావో, పరస్త్రీలను కూడా ఆ విధంగానే గౌరవించడం నేర్చుకో. ఇతరులు ఏమిచేస్తే నీ మనస్సుకు కష్టంగా ఉంటుందో అది నీవు ఇతరుల ఎడ చేయకు. ధర్మబుద్ధివై నీ స్త్రీలయం దను రక్తుడవగుము.

❖ యథా తవ తథాఽన్యేషాం దారా రక్ష్యానిశాచర।
ఆత్మా న ముపమాం కృత్వా, స్వేషు, దారేషు, రమ్యతామ్ (7-21-5)

## సంబరం

❖ అభినన్దన్తి భూతాని వినాశే పాపకర్మణః! (13-21-5)

భా:- పాపకర్మములు చేసేవాడు నశించడం చూచి భూతములన్నీ సంతోషిస్తాయి.

వ్యా:- ఏదైనా మంచి జరిగినపుడు అందరూ సంతోషించడం సహజం. ఆ విధంగానే దుష్టుని పీడ విరగడైనందుకు లోకమంతా ఆనందిస్తుంది. మిక్కిలి ఓర్పు గల భూమి ఒకప్పుడు "ఎంతటి భారమైనా మోయగలను గానీ, దుష్టుని భరించడం మాత్రం నాకు కష్టమ"ని బ్రహ్మతో చెప్పి మొరపెట్టుకున్నట్లు పురాణాల్లో వర్ణింపబడింది. అట్టి దుర్మార్గుడు మరణించటం వలన, తమ విధి నిర్వహణంలో అతని దౌర్జన్యం అంతమైనందుకు భూతములన్నీ సంబరపడతాయి. నరకాసుర సంహారంతో లోకమంతా దీపావళి వెల్లివిరియడం అందుకు ఒక ఉదాహరణ. అందువల్ల విచక్షణులెప్పుడు లోక పీడాకరములైన దుష్కర్మము లాచరింపరు "లోక పీడాకరం కర్మ న కర్తవ్యం విచక్షణైః"

ఎవడు జీవింప జీవింతు రితరు, లతని జీవితమే జీవితము ధన్యజీవి యతడు. (రచయిత)

## వ్యసనములు

❖ రాముడు సీతా లక్ష్మణులు వెంటరాగా దండకారణ్యంలో గల ఆశ్రమాలను సందర్శిస్తూ సజ్జన సాంగత్యంలో వనవాస సమయాన్ని సద్వినియోగం చేసుకొన్నాడు. రాక్షసుల దురాగతములు రామునకు నివేదించి, అచటి మునులు, తమకు రక్షణ కల్పింపుమని కోరారు. రాముడప్పుడు వారికి దుష్ట రాక్షస సంహారం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

తర్వాత రామాదులు సుతీక్ష్ణుని ఆశ్రమానికి బయలుదేరారు. మార్గ మధ్యంలో సీత, రామునితో ఆర్యపుత్రా! మీకు తెలియందీకాదు, మీకు నేను చెప్పదగిన దాన్నీ కాను, అయినా మీరు నా కిచ్చిన చనువుతోను, నాకు మీ యందుండే స్నేహాతిశయంతోను ధర్మ స్వరూపాన్ని మీకు ఇప్పుడు గుర్తు చేస్తున్నాను.

స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం నతు శిక్షయే (24-9-3)

లోకంలో ముఖ్యంగా మూడు వ్యసనాలున్నాయి. ఒకటి అబద్ధమాడటం, రెండు పరదారాభిలాష, మూడు అకారణ వైరం.

త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవంత్యుత
మిథ్యా వాక్యం పరమకం, తస్మా ద్గురుతరా వుభౌ



గౌరవం, ఆదరం లభిస్తాయి. తీరు, తెన్నులేని మాట, సభలో అపహాస్యంపాలు చేస్తుంది. ఒక్కొక్కసారి ప్రాణాంతకం అవుతుంది కూడ. కొద్ది మాటల్లోనే తన విద్యావైదుష్యములు ప్రకటితమయ్యేలాగా మాట్లాడినవాడు హనుమంతుడు, అంతలోనే అతని శక్తి సామర్థ్యములు గుర్తించినవాడు రాముడు. తమోహర్తయగు సూర్యునివద్ద వేదాది సమస్త విద్యలు అధ్యయనం చేసి అపశబ్ద మనేది లేకుండా మాట్లాడటంవలన, అతడు ఉచితజ్ఞుడైన రాముని ప్రశంసకు పాత్రుడైనాడు. సుగ్రీవుని ఆపదల నుండి కాపాడాడు. మహర్షి, ఒక మంచిమాట ఎంతటి మహత్తరమైన కార్యాన్నైనా సాధించిపెడుతుందని ఇచట చక్కగా నిరూపించాడు.

## మృత్యువు

❖ జాతస్య నాన్యత్ర మరణాత్ భయమ్ (17-105-2)
భా:- జీవికి మరణమును మించిన భయము లేదు.

❖ సహైవ మృత్యు ర్వ్రజతి, సహమృత్యు ర్నిషీదతి। (22-105-2)
భా:- మృత్యువు ఎల్లప్పుడు జీవులను వెన్నంటియే ఉంటుంది.

వ్యా:- "వాన రాకడ, ప్రాణ పోకడ ఎవరికి తెలియవని" చెప్తారు. వాతావరణ విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో వర్షపాతాన్ని గుర్చి ఏ కొంచెమైనా ముందుగా గుర్తించగల్గుతున్నారేమో కానీ, జీవుల ప్రాణ ప్రయాణ సమయాన్ని వివరించటం మాత్రం ఎవరికీ సాధ్యపడటంలేదు. ఏ క్షణానికేమి ముంచుకు వస్తుందోనని భయపడుతూ, చేయదల్చుకున్న మంచి పనులు పూర్తిచేయండని పెద్దలంటారు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవడమే కదా మనం చేయవలసిన పని. అందుకే "అనిత్యాని శరీరాణి, విభవో నైవ శాశ్వతః నిత్యం సన్నిహితో మృత్యుః, కర్తవ్యం ధర్మ సంగ్రహః" అన్నారు.

❖ ఆత్మనో నావ బుధ్యన్తే మనుష్యా జీవిత క్షయమ్ (24-105-2)
భా:- మానవులు నిత్యము తమ జీవితము క్షీణించుట గమనింపలేకున్నారు.

వ్యా:- లోకంలో ఎవరైనా పరిచయమున్నవారు కనపడినపుడు ఏమండీ కులాసాగా ఉన్నారా? అని పలుకరిస్తారు. "సామాన్యంగా వారు ఆ! కులాసాగానే

వ్యా:- మానవులకు వయోభేదమును బట్టి, వారి వారి బాధ్యతలను గుర్తింప చేయడానికి ఆశ్రమ ధర్మములు విధింపబడ్డాయి. బాల్యము, యౌవనము, కౌమారము వార్ధక్యము అనే పేర్లతో జీవితం నాల్గు విధాలుగ విభజింపబడుతుంది. అందులో బాల్యము ఆటపాటలతోను, విద్యార్థి దశతోను గడిచిపోతుంది. యౌవనంలో వివాహం చేసుకొని ఇంద్రియ సుఖాల్ని అనుభవించడం జరుగుతుంది. కౌమారదశలో బిడ్డలను యోగ్యులుగా తీర్చిదిద్దటం, వారికి బాధ్యతలప్పగించడం జరుగుతుంది. వార్ధక్యదశలో ముని వృత్తితో కాలం గడిపి, చివరకు యోగం ద్వారా శరీరాన్ని విడిచిపెట్టడం సంభవిస్తుంది. ఈ క్రమంలో బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమములు విపులంగా వివరింపబడ్డాయి. సమాజ వ్యవస్థ పటిష్టంగా ఉండి ప్రజలందరూ ధర్మబద్ధులై ప్రశాంతంగా జీవించడానికి ఈ ఆశ్రమ విభజన జరిగింది. ఇది భారతీయ ధార్మిక వైభవాన్ని ప్రపంచానికి ప్రకటించే ఉత్తమ జీవన విధానం.

ఇందులో గృహస్థాశ్రమం ఇతర ఆశ్రమధర్మాల్ని పాటించేవారికి ఆశ్రయాన్ని కల్పించటమే గాక అవిటి వారికి అనాధలకు ఆధారమై నిలుస్తుంది. దేవపితృ గణాలకు కూడ తృప్తినిస్తుంది. అందువల్ల అన్నింటిలో ఈ గృహస్థాశ్రమం గొప్పదిగ గౌరవింపబడుతోంది. కుల, వర్ణ, వర్గ భేదములు లేక అందరికి ఆచరణయోగ్యమైనది ఈ ధర్మము.

**మంచిమాట**

❖ సంస్కార క్రమసంపన్నా మద్రుతా మవిలంబినీం।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీమ్॥ (34-3-4)

భా:- తొందరపడుట, నాన్చుట అను శబ్దదోషములులేని ఇతడు, సంస్కార సంపన్నము, శుభకరము, మనోహరములైన మాటలు మాటలాడుచున్నాడు.

సం:- "రామ సుగ్రీవులకు సఖ్యము గూర్చుటకు వచ్చిన హనుమంతుని క్లుప్తము, సందేహరహితము అయిన వాగ్విభూతిని రాముడిట్లా అభినందించాడు.

వ్యా:- మానవుని హృదయాన్ని ఆవిష్కరించే ముఖ్యమైన సాధనాలలో మాట ఒకటి. అది వ్యక్తి యొక్క సంస్కారాన్ని తెలియజేస్తుంది, మాటవలననే



పరదారాభి గమనం, వినా వైరంచ రౌద్రతా॥ (3-9-4)

ఇందులో పితృ సత్యవాక్యపరిపాలనము, పరనారీ సోదర భావము గల మీ యందు అనృత భాషణం, పరస్త్రీ వ్యామోహం అనేవి లేవు. ఇక ముందు ఉండబోవు. అయితే ఇప్పటికి మీకు ఏ అపకారం చేయని రాక్షసులను సంహరిస్తానని ప్రతిన బూనటం వలన మూడవది అయిన "అకారణవైర" మనే దోషం, మీ యందేర్పడుతుందేమో అని భయపడుతున్నాను. ఈ వనవాస సమయంలో శాంత ప్రధానమైన మునివృత్తికి, పౌరుష ప్రధానమైన క్షత్రియ ధర్మానికి పొంతన కుదరదు కదా!" అని తన అభిప్రాయం వివరించింది.

అందుకు సమాధానంగా రాముడు "జానకీ, నీ ఆభిజాత్యానికి, సౌజన్యానికి తగినట్లు విద్యావివేక సంపన్నంగా మాట్లాడావు. బాగుంది, మరి ఈ అరణ్యంప్రాంత మంతా రఘువంశ రాజుల ఏలుబడిలోనే ఉంది. ఇందులో నివశిస్తున్న ప్రజల కష్ట సుఖాలు విచారించి కాపాడటం రాఘవుడిగా నా బాధ్యత. అయోధ్యకు పంపుతూ చిత్రకూటంలో భరతునితో చేసుకొన్న ఒప్పందం కూడా ఇదే. అంతేకాక ఆర్త రక్షణ క్షత్రియులకు ఆవశ్య కర్తవ్యము. అదే పరమధర్మము. సత్యవ్రతులు, సాధుశీలులు అయిన ముని జనాన్ని బాధించే రాక్షసులు ధర్మభిమానం గల నాకు ప్రత్యక్షంగా కాకపోయినా పరంపరయా శత్రువులే "అని చెప్పి తన ప్రతిజ్ఞలో గల పరమార్థం ఆమెకు అవగతమయ్యేలా వివరించాడు. సీత సమాధానపడింది.

ఈ సందర్భం పరిశీలించినపుడు భార్యాభర్తల నడుమ సంభాషణ ఎంత సామరస్యంగా ఉండాలో భావ వినిమయానికి సాధనమైన భాష సమన్వయానికి ఏ విధంగా దోహదం చేస్తుందో అర్థమవుతుంది.

సీత ప్రస్తావించిన వ్యసనాలలో మొదటిదైన అసత్యభాషణం అపనిందతో బాటు పూర్వపుణ్యాన్ని కూడా నశింపజేస్తుంది. రెండవదైన పరదారాభిలాష యశస్సును, ఆయుస్సును, హరించటమే కాక, పాపహేతువు కూడ అవుతుంది. మూడవదైన అకారణ వైరం అశాంతిని పెంచి, అనర్థ పరంపరను సహితం కలిగిస్తుంది.

కామ, క్రోధ, లోభములే ఈ వ్యసనాలకు మూలం. అందుకు ప్రతీకయైన రావణుని వినాశమే ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం, ఇదే రామాయణంలోని ముఖ్య

సందేశం. సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలను గూర్చి చర్చించి, వాటికి పరిష్కారంగా రామచరిత్ర వర్ణించిన వాల్మీకి, **'రాముని నడవడి ఆదర్శమానవ జీవిత విధానానికి ఒరవడి'** అని సూచించాడు.

**అహింస**

❖ ఆనృశంసం, పరోధర్మః। (41-38-5)

భా:- అహింసయే పరమధర్మము.

సం:- హనుమంతుని ద్వారా రామునకు పంపిన సీతా సందేశంలోనిదీ వాక్యం.

వ్యా:- గిల్లి, ఏడిపించి, ఆనందించడమనేది పైశాచిక లక్షణం. అకారణ వైరం రాక్షస ప్రవృత్తి. అట్టి స్వభావం మానవత్వానికే మాయని మచ్చ. అందువల్ల అహింసా వ్రతాన్ని పాటిస్తూ జీవితం ధర్మమయంగా గడపాలని ఉత్తము లయిన మానవులు అభిలషిస్తారు.

అయితే నీరు, భూమి, ఆకాశం అంతా జంతుమయం కావటంచేత ప్రతి పనిలోను హింస కొంత చోటు చేసుకోక తప్పదు. అలాంటప్పుడు హింసా విదూరమైన జీవయాత్ర దుర్లభమే అవుతుంది. కావున తాను బుద్ధి పూర్వకంగా హింస చేయకుండ ఉండేందుకు ప్రయత్నించటమే 'అహింస' అనిపించుకుంటుంది. అంతే గాని ఇతరులు తనను హింసిస్తూ ఉంటే ఆదుష్టులను ప్రతిఘటింపక పోవడం అహింసా వ్రతం కాదు. రాఘువుడు రణ విక్రాంతుడై, రాక్షస సంహారంచేయటంలో ఈ ధర్మ సూక్ష్మమే ఇమిడి ఉంది. చరిత్రలో హంతకులైన నియంత లెన్నడు ప్రశాంతిని పొందలేదు. ఉన్నత సౌఖ్యాన్ని సాధించలేదు.

"ఆత్మవత్ సర్వభూతాని" ప్రాణులన్నీ తమ వంటివే అని తెలుసుకొని ఇతరులేమి చేస్తే తమకు కష్టం కలుగుతందో తామితరులకది చేయకపోవడం పరమ ధర్మమని పెద్దలు ప్రకటించారు. దానికి అహింసయే మార్గమని బోధించారు.

**దైవము**

❖ నాత్మనః కామకారోఽస్తి, పురుషోయ మనీశ్వరః (15-105-2)

భా:- పురుషులకు ఐచ్ఛిక వ్యాపారము లేదు. అతడు స్వతంత్రుడుకాదు.



ఆజ్ఞను అనుసరించారు. అంత మాత్రమున వారు శిక్షార్హులు కారనే విషయం సీత సూక్ష్మ దృష్టితో విశ్లేషించి ధర్మమును నిరూపించింది. ఒక్కొక్కప్పుడు పైకి ధర్మమువలె తోచినది విచారింపగా అధర్మముగాను, అధర్మమనిపించింది ధర్మముగాను పరిణమించుట కలదు. వివేకవంతులకే అది గుర్తించటం సాధ్యము. ధర్మము అతి సూక్ష్మమై మిక్కిలి గహనమగుట తెలిసికొని ఇట్టి పట్టుల ప్రవర్తించుట విజ్ఞుల కర్తవ్యమని మహర్షి ఇచ్చట సూచించాడు. ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా! ఆశ్రితులను రక్షించు స్వభావము కలది సీత. (44-27-5)

**మిత్రుడు - శత్రువు**

❖ ఉపకారఫలం మిత్ర, మపకారోఽరి లక్షణమ్ (23-8-4)

సం:- వాలి వధకై రాముడు ప్రతిజ్ఞ చేసిన ఘట్టము.

భా:- ఉపకారమే ప్రయోజనంగా గలవాడు మిత్రుడు. పనికట్టుకొని అపకారం చేయటమే లక్ష్యంగా పెట్టుకొన్నవాడు శత్రువు.

**మైత్రీసంరక్షణ**

❖ సర్వథా సుకరం మిత్రం, దుష్కరం తత్పరిపాలనమ్ (7-32-4)

భా:- మిత్రుని సంపాదించుట తేలికే. అయినా, ఆ మైత్రిని కాపాడు కొనుటయే కష్టం.

❖ అనిత్యత్వాచ్చ చిత్తానాం ప్రీతి రల్పేపి భిద్యతే (7-32-4)

భా:- మనస్సు స్థిరమైనది కాకపోవటం చేత ఏ ఒక్క విషయంలో, ఏ కొంచెం తేడా వచ్చినా అభిప్రాయ భేదం ఏర్పడి ఎంతో ప్రీతిగల మైత్రి కూడ భంగమవుతుంది.

వ్యా:- మిత్రుల మధ్య అభిప్రాయ భేదం ఏర్పడినప్పుడు పరస్పరా రోపణలకు పూనుకొని విడిపోవటం కాకుండ, అవగాహనతో తమ మధ్య చోటుచేసుకొన్న దూరాన్ని తొలగించుకొన్నప్పుడే వారి మైత్రి చిరకాలం నిలుస్తుంది.

**గృహస్థధర్మము**

❖ చతుర్ణామాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్ఠముత్తమమ్ (22-106-2)

భా:- ఆశ్రమములు నాల్గింటిలోను గృహస్థాశ్రమ (ధర్మ)ము గొప్పది.

❖ స్వధర్మం ప్రతిపద్యస్వ (6-21-1)

భా:- నీ ధర్మమును నీవు నిర్వర్తింపుము

❖ నా ధర్మం వోఢు మర్హసి (6-21-1)

భా:- అధర్మాన్ని ఆచరింపవద్దు

❖ పరమాపద్గత స్యాపి ధర్మే మమ మతి ర్భవేత్ (30-10-7)

భా:- "ఆపదలో సహితము, నామనస్సు ధర్మమునందే లగ్నమయ్యేలాగా వరము ప్రసాదింపుము."

వ్యా:- "ధర్మో రక్షతి రక్షితః" ధర్మాన్ని మనం రక్షించినట్లైతే ధర్మం మనల్ని రక్షిస్తుంది. అందుకై విభీషణుడు ధర్మదేవతను గూర్చి చేసిన ఈ అభ్యర్థనము లోకంలోని వారెల్లరు కోరదగిందిగా ఉంది. అధికమై చెలగు అధికార సంపదలు, అమేయ బలపరాక్రమములు, కలిగిన రావణుని యందు అధర్మమే లేకుండిన అతడు సర్వలోకములను రక్షింపజాలిన మహా సామర్థ్య సంపన్నుడయ్యేవాడు. అధర్మము ఆత్మ వినాశనకారణము. కావున ప్రయత్నపూర్వకంగానైనా దాన్ని పరిహరించాలి. ధర్మాన్ని అనుసరించాలి.

## కారుణ్యము

❖ కార్యం కరుణ మార్యేణ (44-113-6)

భా:- సజ్జనులకు కనికరించుటే కర్తవ్యము

❖ న కశ్చిన్నా పరాధ్యతి (44-13-6)

భా:- రావణ వధానంతరము సీతను రాముని సన్నిధికి తోడ్కొని పోవుటకై వచ్చిన హనుమంతుడు ఆమెతో "నిన్నింత కాలము అనేక విధముల బాధించిన ఈ రాక్షసస్త్రీలను నీ ఎదుటనే హింసించెద"నని పలుకగా సీత, వారి యెడ కారుణ్యమును ప్రకటించుట ప్రస్తుతాంశము.

వ్యా:- పూజ్యురాలగు సీతను బాధించిన రాక్షసీజనము వధ్యులని హనుమంతుని అభిప్రాయము. వారు కేవలము ప్రభువు రావణుని ఆజ్ఞ పాలించిన వారగుటచే అవధ్యులేయని సీత సంకల్పము. "నాయనా! నీదృష్టిలో వారు పాపాత్ములే అయినా నా దృష్టిలో వారు శుభవర్తనులే యగుటచే వారు వధార్హులు కారు. నీ ప్రభువు ఆజ్ఞ నీ వెట్లు పాటించుచున్నావో, ఆ విధంగానే వారింత వరకు రావణుని



సం:- చిత్రకూటంలో పితృవియోగ దుఃఖంతో విలపించే భరతుని ఓదార్చు (ఆశ్వాసించు) రాముని ప్రబోధమిది.

వ్యా:- సృష్టి ధర్మములగు జనన మరణములు విధికి అధీనములై ప్రవర్తిస్తాయి. కావున తలయొగ్గి ఆ నిర్ణయాన్ని అనుసరించడమే తప్ప ఎదిరించి సాధించ గలిగింది ఏమీ లేదు. భగవంతుడేది చేసినా మన మంచికే అని తలంచుటయే, మేలు.

❖ నియతిః కారణం లోకే (4-25-3)

భా:- విధియే సకలమునకు కారణము.

❖ విధి ర్నూన మసంహార్యః (4-37-5)

భా:- విధి బలీయము. కావున, దాని తప్పించుట పూర్తిగా తొలగించుట సాధ్యము కాదు. ఆవిధియే దైవము.

❖ దైవంహి పరమాగతిః (22-58-1)

భా:- దైవమే అందరికీ శరణ్యము.

❖ అసంకల్పిత మేవేహ య దకస్మాత్ ప్రవర్తతే ।
నివర్త్యారంభ మారబ్ధం ననుదైవస్య కర్మతత్ ॥ (24-23-2)

భా:- సంకల్పించి, ప్రారంభించిన పని, ఆగిపోయి, అనుకొనని విధంగా వెంటనే మరియొకటి జరుగుటయే దైవ ప్రభావము.

వ్యా:- రామ పట్టాభిషేకానికి అన్నీ సిద్ధం చేయబడి విఫలమగుట దైవ విహితమే కాని అన్యముకాదు. దీనినే విధి విధానమంటారు. అట్టి దైవ సంకల్పము దుష్ట రాక్షస సంహార రూపమైన జగత్కళ్యాణమును సాధించి, లోకములకు శుభమును, సుఖ సంపదలను ప్రసాదించింది.

## స్నేహము

❖ "సృష్టిలో తీయనిది స్నేహమే" అని కవులు వర్ణించారు. ఆ స్నేహం ఎవరితో చెయ్యాలి అనే విషయం రామాయణంలో సుగ్రీవుని ముఖంగా వాల్మీకి ఇలా వివరించాడు.

సోऽహం సభాజ్యో బంధూనాం సుహృదం చైవ రాఘవ।

యస్యాగ్ని సాక్షికం మిత్రం లబ్ధం రాఘవ వంశజమ్॥ (4-8-4)

భా:- రామ సుగ్రీవుల మైత్రి జరిగింది. అది ఒక సజ్జన సమాగమం. అందుకు సంబరపడ్డ సుగ్రీవుడు రామునితో ఓ రామా! ఆడి తప్పని రఘువంశంలో పుట్టిన నీ వంటి ఉత్తమునితో స్నేహం చేయటం వలన నా బంధు మిత్రులలో నాకు ప్రతిష్ఠ పెరిగింది" అని అన్నాడు.

వ్యా:- స్నేహం, వివాహం మొదలైనవి అగ్నిసాక్షికంగా చేయటం భారతీయుల ఆచారం. అగ్ని పవిత్రతకు చిహ్నం కనుక, ఈ బంధం కూడ అంత పవిత్రంగా వెలుగొందాలనేది దాని అశయం.

స్నేహంలో ఒకరి కొకరు సహాయం అందించడం జరుగుతుంది. అది స్నేహధర్మం, సహకారం పొందినవారు చేసిన వారి మంచితనం క్రమంగా గుర్తించాలే కాని సాయం చేసినవాడు ప్రతి చిన్నదానికీ నేనది చేశాను, నేనిది చేశాను అని పదేపదే గర్వంగా మాట్లాడటం, పదిమందిలో గొప్పలు చెప్పుకోవడం మంచిది కాదన్నది ఈ ఘట్టంలో వాల్మీకి ఋషి ఉపదేశంగా గమనిస్తాం. ఇదే విషయం సుగ్రీవుడు రామునితో చెప్పాడు.

అహ మ ప్యనురూపస్తే వయస్యో జ్ఞాన్యసే శనైః ।

నతు వక్తుం సమర్థోఽ హం స్వయ మాత్మ గతాన్ గుణాన్ (5-8-4)

❖ త్వం వయస్యోసి హృద్యోమే హ్యేకం దుఃఖం సుఖంచనౌ (18-5-4)

భా:- నీవు నా కిష్టమిత్రుడవైతివి. మనలో నొకరి సుఖదుఃఖములు మరొకరివైనవి.

వ్యా:- ఇదే నిజమైన స్నేహము.

❖ దుఃఖిత స్సుఖితో వాఽ పి సుఖ్యు ర్నితం సఖాగతిః॥ (9-8-4)

భా:- సుఖ దుఃఖములన్నింటిలోను మిత్రునకు మిత్రుడే తోడు కావుననే

❖ మిత్రభావేన, సంప్రాప్తం, నత్యజేయం కథంచన (3-18-6)

భా:- మైత్రి కోరి వచ్చిన వారిని ఎన్నడూ విడిచిపుచ్చుట తగదు.

**దేశకాల విరోధములు పరిహరించాలి**

❖ కర్మచాపి సమాధేయం దేశకాల విరోధినమ్ (5-46-5)



వ్యా:- రాగ ద్వేషాలు రెండు వాస్తవ దృష్టి నుండి మనల్ని మరలించి మన చేత పొరపాట్లు చేయిస్తాయి. సత్యము నుండి మనల్ని దూరం చేస్తాయి. కావున రాగ ద్వేషాలకు అతీతంగా ఉంటూ, వివేకంతో ప్రవర్తించటం నేర్చుకోవాలి.

**ధర్మము**

❖ ధర్మాదర్థః ప్రభవతి, ధర్మా త్ప్రభవతే సుఖమ్। (22-22-4)

భా:- ధర్మము వలన ధనము, (ధనము వలన) సుఖము లభించును.

వ్యా:- విధి నిర్వహణమే ధర్మము. ఎవరి విధి వారు సక్రమముగా నిర్వర్తించుటయే ధర్మాచరణము.

❖ ధర్మేణలభతే సర్వం (30-9-3)

భా:- ధర్మము వలన అభ్యుదయ నిశ్రేయసములు అన్నియు కల్గును.

❖ ధర్మసార మిదం జగత్ (30-9-3)

భా:- ఈ లోక వ్యవహారమంతా ధర్మం మీదనే ఆధారపడి ఉంది.

❖ ధర్మాత్మా లోకం ధర్మేణయోజయేత్ (20-61-2)

భా:- ధర్మాత్ముడు లోకమును ధర్మ మార్గమున నడుపవలెను.

వ్యా:- పితృ సత్య వాక్య పరిపాలనయే ధర్మమని భావించి, కైక కోరిక ననుసరించి, అడవులకు వెడలుటకు నిశ్చయించుకొన్న రామునితో తల్లి కౌసల్య, "నాయనా! నీవు ధైర్యంతో నియమంగా ఏ ధర్మాన్ని అయితే పాటిస్తున్నావో ఆ ధర్మమే నిన్ను అన్ని వేళలా రక్షించుగాక" యని ఆశీర్వదించి పంపించింది.

❖ యం పాలయసి ధర్మం త్వం ధృత్యాచ నియమేన చ

స వై రాఘవశార్దూల! ధర్మస్త్వా మభిరక్షతు (23-25-2)

వ్యా:- ధర్మాన్ని ఆచరించటానికి ఎంతో ధైర్యం కావాలి. దానికి తోడు ఆసిధారావ్రతం లాంటి నియమ పాలనం కూడా ఉండాలి. ఆ విధంగా ధర్మాన్ని అనుసరించిన రాముడు "రఘువంశంలో" శ్రేష్ఠుడయ్యాడు. మానవుని మహాత్ముని చేసేది ధర్మాచరణ మొక్కటే. అందుకనే వాల్మీకి మహర్షి ధర్మాన్ని ఆచరింపుమని ప్రబోధించాడు. అధర్మాన్ని ఆచరింపవద్దని హెచ్చరించాడు.

దూరం చేసుకుంటాడు. ప్రియులైనవారిని కూడ ఎంతగానే హింసిస్తాడు. మతిమరుపుకులోనై కర్తవ్యాన్ని విస్మరిస్తాడు. అంతేకాదు ఇటు వంటివారు త్రాగితే ఏదో పొడిచేస్తామని అనుకోవడం కూడ వట్టి భ్రమగానే మిగిలిపోతుంది.

మత్తు పానీయాలకు అలవాటు పడటం వల్ల క్రమంగా నరాల బలహీనత ఏర్పడి, మనిషి నిర్వీర్యుడై నీరసించి తుదకు అస్తిత్వాన్నే కోల్పోతాడు. అందుకే ఆ వ్యసనం పాలుకాకండని మహర్షి మానవజాతిని ఉద్బోధించాడు.

నహి ధర్మార్థ సిద్ధ్యర్థం పాన మేవం ప్రశస్యతే।
పానా దర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే॥ (46-33-4)

## ఉత్తముడు

❖ శుభంవా యదివా పాపం యో హి వాక్య ముదీరితం।
సత్యేన ప్రతిగృహ్ణాతి సవీరః పురుషోత్తమః (72-30-4)

భా:- చేయతగిన పని పూని చేస్తున్నప్పుడు శుభా శుభములలో ఏది ఎదురైనా ఎవడైతే చెప్పినది చెప్పినట్లు సమర్థతతో చేసి, మాట నిలబెట్టుకోకల్గుతున్నాడో వాడే లోకంలో పురుషోత్తముడు.

వ్యా:- మనుష్యుని వీరత్వము అతని కార్యనిర్వహణ సామర్థ్యంపై ఆధారపడి ఉంటుందే కాని (కండలు తిరిగిన) శారీరక బలం మీద కాదు.

## అధముడు

❖ అర్థినా ముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణాం॥
ఆశాం సంశ్రుత్య మోహంతి స లోకే పురషాధమః (71-30-4)

భా:- పరుల నుండి సహాయం పొంది, తిరిగి వారికి సహాయాన్ని అందించవలసిన సమయంలో తప్పించుకు తిరిగే వాడే ఈ లోకంలో అధముడు.

## సమదృష్టి

❖ ఉభయం హి మహాన్దోష, స్తస్మాదన్తర దృగ్భవ (22-22-4)

భా:- రాగము, ద్వేషము, రెండును మిక్కిలి దోష యుక్తములే. కావున (మధ్యే మార్గముగ) సమదృష్టితో నడచుట ధర్మము.



భా:- దేశ, కాల విరోధములైన పనులు పరిహరించాలి.

వ్యా:- దేశ కాలములకు విరోధమైనది. ధర్మానికి కూడ విరుద్ధమే కనుక దానిని విసర్జించాలి. ఒక్కొక్క దేశంలో ఆచార వ్యవహారాలు ఒక్కొక్క రకంగా ఉంటాయి. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే అది పరిహాసాస్పద మౌతుంది. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క పని చేయాలనే నియమం ఉంటుంది. అలా చేయక పోవటం కానీ, లేక మరొక విధంగా చేయటం కాని తప్పే. విత్తనాలు చల్లే రోజుల్లో కోతలకని కొడవళ్ళు పట్టుకొని చేలోకి రావటం కాల విరోధమైతే, వస్తువు పడ్డచోట వదిలేసి వెలుగుఉన్న చోట మాత్రమే వెదకటం దేశవిరోధం అవుతుంది.

## మితిమీతి ప్రవర్తించరాదు

❖ సర్వత్రాతి కృతం భద్రే వ్యసనాయోప కల్ప్యతే (22-24-5)

భా:- ఏ విషయంలోనైనా అతిగా ప్రవర్తించటం ఆపదగా పరిణమిస్తుంది.

వ్యా:- వ్యసనమంటే కామ, క్రోధాదుల వలన ఏర్పడిన దోషం. దాని వలన ఆపద సంభవిస్తుంది. అందుకే వ్యసనాన్ని ఆపద అని కూడ అంటారు. ప్రయత్న పూర్వకంగానైన ఆ వ్యసనములను పరిత్యజించాలి.

❖ కామక్రోధ సముత్థాని, త్యజేథా వ్యసనానిచ (43-3-2)

మితి మీటిన నిద్ర, ఆహార, వ్యవహారాలు పనికి రావనడానికి "అతి సత్వత్ర వర్జయేత్" అని పెద్దలు హెచ్చరించారు. అన్నింటిలోను మరిమితంగా ప్రవర్తించటమే యోగి లక్షణంగా గీత ప్రవచించింది.

యుక్తాహార విహారస్య, యుక్తచేష్టస్య కర్మసు!
యుక్తస్వప్నావ బోధస్య యోగోభవతిదుఃఖహా!!

## ఎడబాటు

నిత్యం మనకు సన్నిహితంగా ఉండే భౌతిక సంపదలు కాని, మిక్కిలి దగ్గరైన సంబంధ, బాంధవ్యాలు కాని శాశ్వతంగా ఉండేవికావని, ఎప్పటికైనా, వాటితో వియోగం తప్పదని చెప్తూ "చేరిన సంపదలు కరిగిపోతాయి, పెరిగినవి విరిగి పోతాయి, కూడిన వారు విడిపోతారు, జీవితం మరణంతోనే అంతమౌతుంది. అందువల్ల దేని మీదా మమకారం ఎక్కువగా పెంచుకోకూడదని వాల్మీకి,

రామాయణంలో పలుచోట్ల వివరించాడు. ఇదే వాఙ్మయసారసర్వస్వంగా పెద్దలభివర్ణించారు.

సర్వే క్షయాన్తా నిచయాః, పతనాన్తాః సముచ్ఛ్రయాః।
సంయోగాః విప్రయోగాన్తాః, మరణాంతంచ జీవితమ్।
తస్మా త్పుత్రేషు, దారేషు, మిత్రేషుచ, ధనేషుచ,
నాతి ప్రసంగః కర్తవ్యః, విప్రయోగోహి తై ధ్రువమ్। (11,12-53-7)

❖ స్మృత్వా వియోగజం దుఃఖం, (115-1-4)

భా :- వియోగ దుఃఖాన్ని తలచుకొని, ప్రేమపాత్రుల యెడ అతిస్నేహాన్ని విడిచి పెట్టాలి.

వ్యా:- "ఎవరి కెవరు ఈ లోకంలో? ఏ బంధం ఎంత వరకు శాశ్వతం?" ప్రతి జీవి కర్మానుభవం కొఱకు భూమిపై పుట్టి నూకలు చెల్లి, కాలంతీరగానే దాటి పోతుంది. గమ్యస్థానం చేరుకుంటుంది. అందుచేత నేను, నా వారు అన్న రీతిలో అహంకార, మమకారాలను పెంచుకోవడం, ఏదైనా జరగరానిదని అనుకొన్నది జరిగితే తట్టుకోలేక, తల్లిడిల్లి పోవడం, సరైన పద్ధతి కాదు. ఏ సంబంధమైనా తామరాకుపై నీటిబొట్టువలె అంటీఅంటనట్లు మాత్రమే సంభావిస్తూ, ఆయా బాధ్యతలను నిర్వహిస్తూనే, ఆత్మజ్ఞాన సంపదతో మెలగటం ముఖ్యం.

అవతార పురుషులు (రామాదులు) సహితం పుట్టి, పెరిగి, వచ్చిన ప్రయోజనాన్ని సాధించుకొని వెంటనే తిరిగి యథాస్థానానికి చేరటం ద్వారా, ఎంతటి వారికి వియోగం తప్పదని స్పష్టమవుతోంది. ఇందులో దుఃఖపడవసింది లేదని అట్టి వైరాగ్యస్థితిని అభ్యాసం ద్వారా క్రమంగా అలవర్చుకోవలెనని మహర్షి ఉపదేశించాడు.

❖ యదేకోజాయతేజంతుః ఏక ఏవ వినశ్యతి। (3-103-2)

లోకంలో ప్రతి జీవి ఒంటరిగానే పుడుతోంది. ఒంటరిగానే నశిస్తోంది.

## సుఖము - దుఃఖము

❖ దుర్లభం హి సదా సుఖమ్ (13-18-4)

భా:- ఎల్లప్పుడూ సుఖమే లభింపదు.

వ్యా:- కేవల పుణ్యకర్మములు దైవత్వాన్ని, పాప కర్మములు పశు కీటక



సద సద్వివేక చతురతను కల్గిస్తుంది. అంటే విద్యకు సారం వివేకమన్న మాట. ఆ విద్యా, వివేకములు లోకహితం కొఱకు వినియోగింపబడినప్పుడే సార్థకములవుతాయి. తమ బిడ్డలను అలా తీర్చిదిద్దటానికి తల్లిదండ్రులు గట్టి ప్రయత్నం చేయాలి.

శౌర్యధనులైన రామాదులు విద్య వలన కలిగిన వివేకంతో ఉచితం, అనుచితం (మంచి, చెడు) తెలుసుకొని ప్రవర్తిస్తూ, తల్లి, తండ్రి, గురువు వంటి పెద్దలను మన్నిస్తూ, సాధులను, దీనులను పరిరక్షిస్తూ దుష్టులను శిక్షిస్తూ, పతితజన పావనత్వం కోసం పాటుపడ్తూ, అసహాయులకు సహాయం చేస్తూ, బలహీనులకు బలం చేకూర్చి దిక్కులేని వారికి తామే దిక్కై, వికృతులను పోగొట్టి, ప్రకృతిని కాపాడి, ప్రజలను ధర్మబద్ధంగా పరిపాలించి, ఆచరణం ద్వారా ఆదర్శం బోధించి, పుణ్యతమమైన పరోపకారం కొఱకు జీవితాంతం ప్రయత్నం చేశారు. విద్య కేవలం ఆర్జన కోసమేనని భావిస్తున్న ఈనాటి సమాజంలో కొందఱికి విద్యా ప్రమాణాలపై శ్రద్ధ నశించటంతో వారు తమ జీవిత లక్ష్యం మఱచి, ఉపద్రవాలు, విధ్వంసక చర్యలు పెచ్చు పెరగడానికి కారకులవుతున్నారు, నేడిట్టి స్థితిలో వివేకాన్నిచ్చి ధర్మప్రవర్తనాన్ని ప్రోత్సహించే విద్య ఎంతైనా అవసరం. అందుకు రామాదుల విద్యాభ్యాసాన్ని గూర్చి వర్ణించి చెప్పిన "వాల్మీకివాణి" మార్గదర్శనం చేస్తుందని ఆశిద్దాం.

## మద్యపానం మంచిదికాదు

❖ పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే (46-33-4)

భా:- మద్యపానము వలన ధనము ధర్మమేకాక కామము సహితము క్షీణిస్తుంది.

సం:- లక్ష్మణుడు, సుగ్రీవుని కర్తవ్యోన్ముఖుడవు కమ్మని హెచ్చరించిన ఘట్టము.

వ్యా:- మద్యపానం ఒక వ్యసనం. ఇందుకు ధనం ఎక్కువ వ్యయమవడమే కాక శరీరం త్వరగా నశిస్తుంది. త్రాగిన మత్తులో ఏమి చేస్తున్నాడో తెలియక ధర్మాన్ని తప్పి బాధ్యతారహితంగా ప్రవర్తిస్తాడు. పెద్దల్ని నిందిస్తాడు, మిత్రులను

దాక్షాయణి (సురస) పరీక్షలో నెగ్గి, సింహకను సంహరించి, హనుమంతుడు ముందుకు సాగి పోవటాన్ని చూచి ఆకాశంలో సంచరించే భూతములు అతనిని ఈ విధంగా అభినందించాయి.

వ్యా:- ఒక పని ప్రారంభించి పూర్తి చేయాలంటే ముందు ధైర్యం కావాలి. రాబోయే కష్టనష్టములు గ్రహించి వాటి నుండి తప్పుకోగల సూక్ష్మ దృష్టి ఉండాలి. ఎప్పుడేపని చేయాలో చెప్పే శాస్త్ర నిర్ణయ జ్ఞానము సంతరించుకోవాలి. ఆ పని త్వరగా పూర్తి చేయగల సామర్థ్యము ఉండాలి. ఇవి అన్నీ ఒకచోట కూడినప్పుడు కార్యసిద్ధి లభిస్తుంది. అట్టి శక్తి గల వారు లోకహితాన్ని సాధించగలుగుతారు. మహాత్ముల ప్రశంసలందుకొంటారు.

సీత జాడ తెలిసి వచ్చిన అద్భుత చరిత్రుడైన హనుమంతుని సాహస కృత్యమును ప్రశంసిస్తూ రాముడు, స్వయంగా "ఈ భూమి మీద వేరొకరు ఇట్టి దుర్లభమైన పని చేయలేరు సరి కదా! మనసుతోనైనా ఊహించటానికి సమర్థులు కారని" పలికి, ఈ నాడు ఈ హనుమంతుని వల నేను, లక్ష్మణుడే గాక రఘువంశం సర్వం ఆపదలపాలు కాకుండ కాపాడ బడిందని అతనిని మన స్ఫూర్తిగా అభినందించాడు.

కృతం హనుమతా కార్యం, సమహ ద్భువి దుర్లభం
మనసాపి యదన్యేన నశక్యం ధరణీతలే" (2-1-6)
అహంచ రఘువంశ శ్చ లక్ష్మణశ్చ మహాబలః।
వై దేహ్యా దర్శనేనాఽ ద్య ధర్మతః పరిరక్షితః॥ (11-1-6)

### విద్య

❖ సర్వే వేద విదశ్శూరాః, సర్వేలోకహితేరతాః।
సర్వే జ్ఞానోప పన్నాస్తే, సర్వేసముదితాగుణాః॥ (33-18-1)

భా:- దశరథ తనయులైన రామాదులు నల్వురు వీరులు, విద్యా వివేక గుణ సంపన్నులు, లోకహిత నిష్ఠులు అయి వర్ధిల్లుచున్నారు.

సం:- విద్యావంతులైన రామాదుల వైదుష్యమును వర్ణించిన ఘట్టము

వ్యా:- 'విదంతి అనయా విద్య' అన్న వ్యుత్పత్తిని బట్టి జ్ఞానం సంపాదించడానికి సాధనమైంది "విద్య" అని తెలుస్తోంది. విద్య మానవులకు



భావాన్ని కలిగిస్తాయి. పుణ్య, పాప సంకరము వలననే మానవజన్మ సిద్ధిస్తుంది. ఆకర్మానుభవంలో సుఖ, దుఃఖములు కలగుతాయి. కేవలం సుఖమే కావాలని ఆరాటపడటమే ఈ జీవిత పోరాటంలోని ఆంతర్యం. ఎవరికెంత వ్రాసిపెడితే అంతే దక్కుతుంది. కాని, వీసమంతైనా ఎక్కువ లభ్యంకాదు. దుఃఖానికి, దుఃఖానికి మధ్యగల విరామమే సుఖమని భ్రమ పడుతున్నామని, నిజమైన సుఖం ఈ లోకంలో ఎక్కడా లభింపదని పెద్దలు వివరించారు. "జన్మరాహిత్యం వలననే శాశ్వత సుఖం (మోక్షం) లభిస్తుందని, అందుకు తగిన జాగృతి పొంది, దుఃఖ బహుళమై జనన మరణాత్మకమైన ఈ సంసార సాగరం నుండి బయటపడమని" శ్రీ శంకరులు సెలవిచ్చారు.

జన్మ దుఃఖం, జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః।
సంసార సాగరం దుఃఖం, తస్మాజ్జాగృత, జాగృత ॥

### కేవలం సుఖాభిలాష దుఃఖహేతువు

❖ న సుఖా ల్లభ్యతే సుఖమ్ (31-9-3)

భా:- సుఖము వలన సుఖము లభింపదు

వ్యా:- సామాన్యంగా లోకంలో ఏ ప్రాణికైనా సుఖపడాలనే ఉంటుంది. భౌతికమైన సుఖాలకు అన్నింటికి ఇంద్రియములే సాధనములు. వాటిశక్తి పరిమితం కావటంచేత అవి ఎక్కువగా శ్రమ పడటానికిక సమర్థములు కావు. ఉదాహరణకు రుచిగా ఉందని పొట్టకు ఎక్కువ తింటే అజీర్ణం చేస్తుంది. అదే పనిగా టి.వి. చూస్తే కంటికి శ్రమ కల్గుతుంది. పెద్ద శబ్దం వింటే చెవులు దిబ్బెళ్ళు వేస్తాయి చల్లదనాన్ని ఆశించి శీతల పానీయాలు అధికంగా సేవిస్తే జలుబుచేస్తుంది. పళు ్ళ తీపులు పుడతాయి. ఎక్కువకారం తింటే కడుపులో మంట ప్రారంభమౌతుంది. ఇక త్రాగు బోతుతనం, తిరుగుబోతు తనం వల్ల కలిగే అనర్థం ఇంతా అంతా అని చెప్పనలవి కాదు. తాత్కాలిక సుఖాల్ని మాత్రమే ఇచ్చే తక్కిన దుర్వ్యసనాలన్నింటివల్ల నిందలు సంభవిస్తాయి. సభ్యసమాజంలో గౌరవం నశిస్తుంది. చివరకు ఆత్మ వినాశంతో పాటు ఆశ్రితులకు దుఃఖాన్ని పంచటం జరుగుతుంది.

అందువల్ల అభ్యంతరములతో కూడిన విషయ సుఖాలేవీ నిజమైన సుఖాలు కావు. అవి అనుభవించిన కొద్దీ మరింత అనుభవించాలనే కోరిక కలుగుతుందే

తప్పు తృప్తి ఏర్పడదు. అగ్నికి ఆజ్యంపోస్తే ఆ జ్వాల పెరుగుతుందేకాని తరగదు కదా.

నిపుణులైన సమర్థులుకొందరు ప్రయత్నపూర్వకమైన ఆ యా నియమముల ద్వారా ఆత్మ నిగ్రహాన్ని సాధించి ధర్మమును సంపాదిస్తున్నారు. ధర్మబుద్ధికి కలుగు ఆత్మ సుఖమే సుఖము, కేవలం భౌతిక సుఖాభిలాషులకు చివరకు దుఃఖమే తప్ప నిజమైన సుఖము దక్కదు.

ఆత్మానం నియమై, స్తై స్తైః కర్శయిత్వా ప్రయత్నతః।
ప్రాప్యతే నిపుణై ర్ధర్మో నసుఖా ల్లభ్యతే సుఖమ్। (31-9-3)

## కర్తవ్యము

❖ కర్తవ్య మకృతం కార్యం సతాం మన్యు ముదీరయేత్ (93-1-5)

భా:- సకాలంలో చేయదగిన పనిని చేయనిచో పెద్దలకు ఆగ్రహం కలుగుతుంది.

సం:- రామ కార్యార్థమై లంకకు బోవు హనుమంతునకు ఆతిథ్యమిమ్మని సముద్రుడు మైనాకుని ప్రోత్సహించుట ప్రస్తుత సందర్భము.

వ్యా:- ప్రతి జీవికి ఒక కర్తవ్యం ఉంటుంది. అది సరిగా నిర్వర్తించటం ధర్మం. ఆ కర్తవ్యం చేయక పోవటం అధర్మం, మహాత్ములకది ఆగ్రహాన్ని కల్గిస్తుంది.

తూర్పు తెల్లవారుతోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు "ఓ రామా! నిద్రలేచి దేవ పూజ, అగ్ని కార్యము, నిర్వర్తింపు"మని రాముని విశ్వామిత్ర ముని ప్రబోధించాడు. అట్టి ధర్మాచరణము రాముని నరశార్దూలునిగా సంభావింప జేసింది.

కౌసల్యా సుప్రజారామా ! పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మహ్నికమ్॥ ( 2-23-1)

ద్విజునకు సంధ్యా వందనము, సైనికునకు దేశ రక్షణ, ఉపాధ్యాయునకు పాఠప్రవచనము, శిష్యులకు గురుభక్తి, తనయునకు తండ్రిమాట పాటించుట, భార్యకు భర్తృహితము కోరుట, ప్రభువునకు, కన్న బిడ్డలవలె ప్రజల పాలించుట, ప్రజలు ప్రభుత్వమును గౌరవించుట మొదలగునవి కర్తవ్యములు-అట్లే ఆయా



చూచుచున్న"దని హనుమంతుడు గుర్తించాడు. సుఖ దుఃఖాలకు అతీతమైనది ఆ దాంపత్య బంధం అని సంభావించాడు.

❖ నైషా పశ్యతి రాక్షస్యః నేమాన్ పుష్ప ఫల ద్రుమాన్।
ఏకస్థ హృదయా నూనం రామ మే వాను పశ్యతి ॥ (25-16-5)

ప్రస్రవణ పర్వతం మీద సీతాదేవి వియోగంతో కాలం గడుపుతున్న రాముని గూర్చి హనుమంతుడు సీతతో "అతడు నీ యందనురక్తితో నిద్రాహారములు విడచి, సౌఖ్యమునుమఱచి, అనన్య చిత్తమున నిత్యము నిన్నే ధ్యానించుచు రాత్రులందు ఎప్పటికో కొంచెము నిద్ర చెందినను అంతలో 'సీతా' యని కలవరించుచు మేల్కొనుచున్నాడ"ని వివరించాడు. తనువులు వేరైనా ఒకే మనస్సు ఒకే మాట కల్గిన సీతా రాముల ప్రేమాను రాగములట్టివి.

నిత్యం ధ్యానవరో రామో, నిత్యం శోక పరాయణః॥
నాన్య చ్చింతయతే కించ త్సతు కామవశంగతః॥
అనిద్ర స్సతతం రామః సుప్తోఽ పిచ నరోత్తమః।
సీతేతి మధురాం వాణీం వ్యాహర న్ప్రతి బుధ్యతే" (43,44-36-5)

అది యట్లుండ ఈ నాటి వివాహ బంధములు వ్యాపార సంబంధములై, కల్యాణ వేదికలు కలహ రంగములుగా మార్చబడుతున్నాయి, వైవాహిక విలువలు మంట కలుపబడి, సంసారములు అస్థిరములై నైతిక పతనాన్ని పొందుతున్నాయి ఇట్టి కాలుష్య నివారణమునకు సీతారాముల పవిత్ర దాంపత్యము ఉత్తమ ఆదర్శంగా నిలుస్తుంది. స్త్రీ పురుషులు సంస్కారాన్ని పొందటానికి తగిన స్ఫూర్తినిస్తుంది.

## కార్యసాధనములు

❖ యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ।
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స కర్మసు నసీదతి॥ (189-1-5)

భా:- నీ వలె ధైర్యము, సూక్ష్మ దృష్టి, జ్ఞానము, క్రియాకౌశలము అను ఈ నాలుగు గుణములు కలవాడు తాను చేయ సమ కట్టిన పనిని నిర్వహించటంలో ఎన్నడూ విఫలుడు కాడు. తప్పక విజయాన్నే సాధిస్తాడు.

సం:- ఆకాశ మార్గంలో లంకకు వెళ్తూ, మైనాకుని మైత్రితో సంభావించి,

బంధము శాశ్వతమై శుభప్రదముగ వర్ధిల్లుట అనుభవస్థిము. అట్టి దంపతుల ప్రేమ నిర్మలమై సుఖ దుఃఖముల రెండింటిలోను ఒకటిగానే భాసిస్తుంది. పవిత్రమైన ఆ మధుర ప్రణయం ఎంతటి త్యాగానికైనా వెనుకాడదు. అద్వైత భావ పరిపూర్ణత కది పరమోదాహరణము.

అడవులకు వెళ్తూ రాముడు, సీతను అయోధ్యలో ఉండ మంటే సీత, "నీతో కలిసి ఉంటే అదే అయోధ్య. నీతోనే నాకు స్వర్గం. నీవు లేనిచోటే నాకు నరకం."

యస్త్వయా సహ స స్వర్గో నిరయా య స్త్వయా వినా (21-27-2)

అని వివరించింది. రామునితో బయలు దేరి అరణ్యాలకు వెళ్ళటానికే తన సంసిద్ధతను వ్యక్తం చేసింది. రాముడు కూడ "సీతా! నీవు లేని స్వర్గ సుఖాన్ని సహితం నేను ఇష్టపడనన్నాడు.

❖ నదేవి తవ దుఃఖేన స్వర్గ మప్యభిరోచయే (27-30-2)

పవిత్రమైన ఆ వైవాహిక బంధము నందలి ఇట్టి పరమోత్కృష్ట భావనయే సీతకు రావణు నంతటి వానిని తృణ ప్రాయంగా ఎంచి, ఎదిరించగల ఆత్మ విశ్వాసాన్ని ప్రసాదించింది. "రావణా! నీ అధికార సంపదలు నన్ను ప్రలోభ పెట్టలేవు సూర్యునికి, వెలుగునకు గల అవినాభావ సంబంధమే మా ఇరువురి అనుబంధానికి పోలిక" అని వక్కాణించింది.

శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేన వా।
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ యథా ప్రభా॥ (15-21-5)

వారిరువురి మనసులు తెలుసుకొన్న హనుమంతుడు అశోకవనంలో ఇలా తలపోశాడు "ఈమె మనస్సు అతని యందు, అతని మనస్సు ఈమె యందు లగ్నమైనవి. కావుననే క్షణమైననూ వీరీ వియోగ దుఃఖమును భరింప జాలకున్నారు.

అస్యా దేవ్యా మన స్త స్మిం, స్తస్య చాస్యాం ప్రతిష్ఠితం।
తేనేయం న చ ధర్మాత్మా ముహూర్తం మపి జీవతి (52-15-5)

అశోకవనంలో, "సీత ఇక్కడి రక్కసి జనాన్ని గాని, ప్రకృతి సుందరములైన ఈ పుష్పఫల ద్రుమములను గాని గమనించక హృదయస్థుడైన రాముని మాత్రమే



స్థానములలో జనులు తమ తమ బాధ్యతలు నిర్వర్తించవల్సి ఉంటుంది. అలా జరిగినప్పుడు సమాజంలో ప్రతి ఒక్కరూ నరశ్రేష్ఠులై వెలుగొందుతారు.

కర్తవ్య నిర్వహణలో లోపం వచ్చినపుడు సమాజ వ్యవస్థలో ఒడిదుడుకు లేర్పడతాయి. ధర్మానికి హాని వాటిల్లుతుంది సమాజం అశాంతికి లోనవుతుంది అందువల్ల అందురు కర్తవ్యం పాటించి తీరాలి. చేయరాని పని చేయటం ఎట్లా నేరమో, చేయవలసిన పని సకాలంలో చేయక పోవడం అలానే నేరం అవుతుంది.

సుగ్రీవుడు రాముని సహాయంతో కిష్కంధకు రాజై భోగలాలసుడై సకాలంలో రామకార్యం కొఱకు పూనుకోక పోవటం వల్ల అతడు లక్ష్మణునిచే హెచ్చరింప బడ్డాడు. అంతలో తన కర్తవ్యాన్ని గుర్తించి సక్రమంగా ప్రవర్తించడం వలన రామకృపకు పాత్రుడయ్యాడు. అయోధ్యలో భరతుని అభినందన హరిచందనము లందు కొన్నాడు.

❖ కర్మభూమి మిమాం ప్రాప్యకర్తవ్యం కర్మ యచ్ఛుభమ్ (20-109-2)

భా:- ఈ కర్మ భూమి యందు పుట్టి శుభకర్మము లాచరించుటే కర్తవ్యము

సం:- చిత్రకూటమున రాముడు జాబాలి ప్రస్తావించిన నాస్తిక వాదమును ఖండించి ధర్మమును ప్రతిపాదించిన ఘట్టము.

వేదభూమి, ధర్మభూమి అయిన భారతదేశము సత్కర్మాచరణంలో ప్రసిద్ధి చెందింది. "భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవ" మొదలుగాగల శ్రుతి శుభమునేవిని, శుభమునే చూచి, శుభమునే ఆచరించమని ప్రబోధిస్తోంది. వేద విహితమగు ఈ శుభ కర్మాచరణము వ్యక్తికి, సమాజానికి, దేశానికి ప్రపంచానికి మేలు చేకూరుస్తుంది.

## ప్రియము - హితము

❖ సులభా పురుషా రాజన్ సతతం ప్రియ వాదినః
అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః। (2-33-3)

భా:- ముఖప్రీతికై ఇచ్చకము లాడేవారు ఎక్కడైనా, ఎప్పుడైనా సులభంగా తారసపడతారు. వారు ప్రియవాదులే కాని యథార్థాన్ని బోధించే వారు కాదు " ఎవరెటు పోతే మన కేమిటి? ఎవరితో ఏ మంటే ఎక్కడ ఏ తగాదా వస్తుందో"

అని వారికి భయం. అందువల్ల వినటానికి అప్రియమైనా హితముకూర్చే మాట చెప్పేవారు లేరు. ఒక వేళ ఎవరైనా సాహసించి చెప్పినా, వినే వారూ లేరు. "నీ పని నీవు చూసుకో. మాకు చెప్పక్కఱలేద"ని మంచి మాట వింటానికి నిరాకరిస్తారు. ఇదీ లోకం పోకడ.

సం:- మారీచుడు సీతాపహరణోద్యమం మానుకొమ్మని రావణునితో చెప్పిన ఘట్టములోని వీ వాక్యములు.

వ్యా:- ఈ నాడు సాహిత్య ప్రపంచానికి ఇదే దుస్థితి సంభవించింది. బజారులో కుప్పలు, తెప్పలుగా లభించే అశ్లీల శృంగార రచనలు ప్రియంగా కన్పట్టి అకర్షిస్తూ, సమాజాన్ని అందునా, యువతరాన్ని పెడత్రోవ పట్టిస్తున్నాయి, మనసులో ఉండే కామ క్రోధాదులను రెచ్చగొట్టి ఇంద్రియ చాపల్యాన్ని పోత్సహిస్తున్నాయి.

భారతీయ సంస్కృతి మొదటి నుండి ఇంద్రియ నిగ్రహంద్వారా ధర్మాచరణ సాధ్యమవుతుందని చెప్తూ, జీనితాన్ని సార్థకం చేసుకొనే మార్గాన్ని సూచించింది. సమాజం సుఖశాంతులలో వర్ధిల్లటానికి తగిన సంస్కార యుక్తమైన సాహిత్య సంపదను అందించింది. వ్యామోహమనే చీకట్లను పారద్రోలి, విజ్ఞాన జ్యోతులను ప్రసాదించే ఈ రామాయణం వంటి ఉత్తమ సాహిత్యం అధ్యయనం చేయటం జాతిమనుగడకు దోహదపడుతుంది. అందుకే వాల్మీకిమహర్షి మాన్యము, మహిమాన్వితము అయిన రామకథ వినిపించాడు. ఒక జాతి యొక్క గొప్పతనం అచట పుట్టిన సాహిత్యాన్ని బట్టి తెలుస్తుందనేది చరిత్రనిరూపించిన సత్యమేకదా.

❖ మమూర్షూణాం హి సర్వేషాం యత్పథ్యం తన్నరోచతే (17-53-3)

భా:- మరణ మాసన్నమైన వారికి మంచి మాటలు రుచించవు.

వ్యా:- కాలపాశబద్ధులగు వారికి మంచితోచదు. ఇతరులు చెప్పినా వినరు. పై పెచ్చు విపరీత వర్తనులై సంచరిస్తారు.

## ఉపదేశము

❖ నహ్యనిష్టోఽను శిష్యతే (21-11-3)

భా:- ఇష్టుడు కాని వాడు ఉపదేశింప బడదు



భా:- వేదములు, సత్యమును ప్రతిష్ఠించుచున్నవి. కావున సత్యమునే పాటింపుము.

❖ సత్య మేక పదం బ్రహ్మ (7-14-2)

భా:- ఓంకార రూపమగు సత్య మొక్కటియే పరమ ప్రాప్యమగు బ్రహ్మము

❖ సత్యే ధర్మః ప్రతిష్ఠితః. (7-14-2)

భా:- సత్యము నందే ధర్మము ప్రతిష్ఠింపబడింది.

❖ సత్యమే వాక్షయా వేదాః (7-14-2)

భా:- అక్షయమగు వేదములు సత్యమునే ప్రధానముగా ప్రతిపాదించు చున్నవి.

❖ సత్యే నైవాప్యతే పరం. (7-14-2)

భా:- సత్యము వలననే పరమ ప్రయోజనము మోక్షము పొందబడుచున్నది. కావుననే రాముడు "లోభము వలన గాని, మోహము వలన గాని, అజ్ఞానము వలన గాని, తమోఽ నిత్వుడనై కాని, తండ్రికి ఇచ్చినమాట తప్పి ఇహ పరములకు సేతువైన సత్యమును నేను భంగపరుపజాల" నని వక్కాణించాడు.

నైవలోభా న్న మోహాద్వా నహ్యా జ్ఞానా త్త మోన్వితః
సేతుం సత్యస్య భేత్స్యామి గురో స్సత్య ప్రతిశ్రవః (17-109-2)

## దాంపత్యము

❖ తుల్య శీల వయో వృత్తాం, తుల్యాభిజన లక్షణాం।
రాఘవోఽర్హతి వైదేహీం, తంచేయ మసితేక్షణా॥ (5-16-5)

భా:- 1) శీలము 2) వయస్సు 3) వృత్తము 4) అభిజనము 5) శుభ లక్షణములు సమముగా గల సీతారాము లిరువురు. ఒకరికొకరు తగి ఉన్నారు.

సం:- అశోకవనంలో సీతను సందర్శించిన హనుమంతుడు, సీతారాముల దాంపత్యమున గల సమతౌల్యమును ఈ విధంగా సంభావించారు.

వ్యా:- స్త్రీ పురుషుల పరస్పరాను రాగ విషయములను వివాహ బంధంతో ముడివేసి దంపతులనుగా చేయటమే భారతీయ వైవాహిక సంప్రదాయంలోని విశేషం. ఆ దంపతుల నడుమ అన్ని విధముల సమత్వము కుదిరినప్పుడే ఆ

సం:- అశోకవనంలో సీతా రావణ సంవాద ఘట్టము.

వ్యా:- "కన్ను దోయికి నన్యకాంతలడ్డంబైన మాతృభావన చేసి మరలిపోవుట" మన సంస్కృతి. రాముని చరిత్రే అందుకు ఆదర్శం. అందమైన స్త్రీలందరినీ అనుభవించాలని కోరుకోవటం, పతివ్రతలను బలాత్కారం చేయటం దుష్టరావణ సంప్రదాయం. అదే రాక్షసత్వం. అట్టి పాపభావన ఆరోగ్యాన్ని క్షీణింపజేసి శరీరము నశించుటకు కారణమవుతుంది.

❖ ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా (43-22-5)

భా:- నిన్ను ప్రేమతో కోరుకొన్న స్త్రీతో కలిసియుండుట వలన నీకు ఆయురారోగ్యములు వృద్ధి పొందుతాయి. ఇందులో మానసిక, వైజ్ఞానిక, తత్త్వశాస్త్రములు వివరింపబడ్డాయి. పవిత్రమైన వివాహబంధంలోని విశిష్టత కీర్తింపబడింది.

ఈ లోకంలో మనం కోరి, తీర్చుకొనే కోరిక ధర్మబద్ధమైనది కావాలి. అట్టి కోరికను తీర్చుకోవడంలో సుఖము, సంతోషంతో బాటు వ్యక్తికి వికాసము, తేజస్సు కూడ లభిస్తాయి. శారీరకంగా పొందే లైంగిక సుఖము యొక్క స్థాయి అందులో పాల్గొనే వ్యక్తుల మధ్య నెలకొన్న ప్రేమపై ఆధారపడి ఉంటుంది.

## అన్నింటికన్న, సత్యము మిన్న

❖ సత్య మేవేశ్వరో లోకే-సత్యం పద్మా శ్రితా సదా
సత్యమూలాని సర్వాణి, సత్యాన్నాస్తిపరం పదమ్। (13-109-2)

భా:- సత్యమే ఈ లోకములను నడుపుశక్తి, సత్యమే సంపదలకు ఆశ్రయము. సత్యమే జగద్వ్యవహారము లన్నింటికి మూలం. సత్యముకంటే ఉత్కృష్టమైనది వేరొకటి లేదు.

సం:- చిత్రకూటమున రాముడు సత్య ప్రశంస చేయుట

❖ ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవహి మేనిరే (11-109-2)

భా:- ఋషులు, దేవతలు సత్యమునే విశిష్టముగా సంభావించారు.

❖ సత్య వాదీహి లోకేస్మిన్ పరం గచ్ఛతి చాక్షయమ్ (11-109-2)

భా:- సత్యమునే పలుకువాడు ఇహ పర సుఖములను పొందుతాడు.



వ్యా:- మనతో ఎవరైనా మంచి మాట చెప్పారు అంటే, వారికి మనపై ప్రేమ ఉందని అర్థం చేసుకోవాలి. వారి తాత్పర్యం గ్రహించి ఆచరించేందుకు ప్రయత్నించాలి. దారిన పోయే దానయ్యను పిలిచి కూర్చోపెట్టి మంచి, చెడు చెప్పటం మందలించటం జరగదు. మనమేలు కోరే వారే మనకు ఉపదేశిస్తారు. చిరాకు పడకుండా, నిర్లక్ష్యం చేయకుండా ఆమాట పాటిస్తే అభ్యుదయం కలుగుతుంది. తల్లి, తండ్రి, గురువు, మిత్రుడు మొదలైన వారు సహజంగానే హిత స్వభావం కలిగి ఉంటారు. వారేదైనా మంచి చెప్పినప్పుడు తమను బాధిస్తున్నారని భావించే వాడు మూర్ఖుడు, వినాశోన్ముఖుడు అవుతాడు.

## నిస్స్వార్థము

❖ యద్వినా భరతం త్వాంచ శత్రుఘ్నంవాஉపి మానద।
భవేన్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం శిఖీ॥ (3-97-2)

భా:- లక్ష్మణా! నీకు, భరతునకు, శత్రుఘ్నునకు కానిది, లేనిది అయిన సుఖం ఏదయినా కొంచెం నా కంటూ ఉంటే, అగ్నిహోత్రుడది దహించుగాక.

సం:- చిత్రకూటంలో భరతుని ఆగమనాన్ని అపార్థం చేసుకొన్న లక్ష్మణునికి రాముడు యథార్థాన్ని బోధించి, తన సోదర వాత్సల్యాన్ని ప్రకటించు సందర్భము.

చరిత్రలో తండ్రిని, సోదరులను, బంధువులను చంపి రాజ్యాధికారాల్ని పొందాలని ఆశించిన రాజు లెందరో ఉన్నారు. మానవత్వం సిగ్గుపడాల్సిన అట్టి సందర్భాలెన్నో గతంలో జరిగిపోయాయి. అటువంటిది రాముడు సోదరులను కాదని తాను వేరుగా సుఖపడటానికే ఇష్టపడలేదంటే ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. మానవ జాతికది మహోన్నతమైన ఆదర్శంగా నిలుస్తుంది.

చేను గట్టు దగ్గరో, సరిహద్దు గోడ దగ్గరో, తగాదాపడి తలలు పగులగొట్టుకొని, కోర్టులచుట్టూ తిరిగే సోదర వర్గానికి సహనంతో, త్యాగంతో కుటుంబ సమస్యల్ని పరిష్కరించుకొని, రక్తపాతం లేకుండా సర్దుబాటు చేసుకోవటం ఎలాగో వాల్మీకి, రామాయణం ద్వారా నిరూపించాడు.

## ధన్యత

రాముని అయోధ్యకు తోడుకొని రావాలని బయలుదేరిన భరతుని సదభిప్రాయాన్ని గ్రహించి గుహుడు అతని ధన్యాత్మునిగా కీర్తించాడు. రామపాదసేవలో పునీతుడైనవాడు భరతుడు.

❖ ధన్యస్త్వం నత్వయా తుల్యం పశ్యామి జగతీతలే।
అయత్నా దాగతం రాజ్యం యస్త్వంత్యక్తు మిహేచ్ఛసి (12-95-2)

కళ్యాణ చరితుడు, భక్తి భరితుడు అయిన భరతుడు, లోకంలో సోదర ప్రేమకు త్యాగానికి ప్రతీకగా నిలిచిపోయాడు. అదియే అతని ధన్యత. "నసర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః (15-18-6) అని రాముడే అతనిని అభినందించాడు.

## ప్రత్యక్ష దైవములు

❖ అస్వాధీనం కథం దైవం ప్రకారై రభిరాధ్యతే।
స్వాధీనం సమతి క్రమ్య మాతరం పితరం గురుమ్ (33-30-2)

భా:- కంటికి కనబడని ఆ దైవము యొక్క ఆరాధనము కన్నా, ప్రత్యక్ష దైవములైన తల్లి, తండ్రి, గురువు అను ఈ ముప్వురి సేవయే మిన్న.

సం:- పితృ సత్య వాక్య పరిపాలనమునకై రాముడడవులకు, బోవుచు పెద్దల మాట వినడం, వారిని, సేవించటం ముఖ్య ధర్మంగా వివరించిన సందర్భం.

వ్యా:- జన్మ నిచ్చినవారు తల్లి దండ్రులు. జ్ఞాన జన్మనిచ్చినవాడు గురువు. వీరు ముప్వురు ప్రత్యక్షదైవాలు. వీరిని సేవించటం మానేసి, ఇతరత్రా చేసిన దేవతారాధనములు మొదలగునవి సత్ఫలితములను ప్రసాదింపవు. వీరు సంతుష్టులైతే చాలు దేవతలు సహితము ప్రసన్నులై వరములిస్తారు. అందువల్లనే శ్రుతి "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అని (కఠోపనిషత్) ఉపదేశించింది. భారతంలో ధర్మవ్యాధుని కథ ఈ విషయాన్నే ఉదహరణంగా సమర్థిస్తోంది.

## జీవితం

❖ వినాశే బహవో దోషాః (47-13-5)

భా:- ఆత్మహత్య వలన అనేక దోషాలు సంభవిస్తాయి.

సం:- లంకలో సీత జాడ తెలియక హనుమంతుడు నిర్వేదంలో



## మరణించిన వారితో వైరము లేదు

❖ మరణాంతాని వైరాణి (26-112-6)

భా:- వైరము మరణముతో అంతమగును

సం:- రావణ మరణాంతరము విభీషణుడు దుష్టుడైన అతనికి ఉత్తరక్రియలు నిర్వర్తించటానికి నిరాకరిస్తాడు. అప్పుడు రాముడు, విభీషణునకు ఈ విషయం చెప్పి "నీ సోదరుడిప్పుడు నాకూ సోదరుడే" నీవు చేయక పోతే నేనైనా చేస్తానని చెప్పి విభీషణుని కర్తవ్యోన్ముఖుణ్ణి చేశాడు.

వ్యా:- లోకంలో ఎవరితోనైనా మాట పట్టింపు వచ్చి విరోధం ఏర్పడితే ఆ నిప్పు తరతరాల వరకు రాజు కుంటూనే ఉంటుంది. ఒకప్పుడది వ్యక్తిగతంగానే అంతమైతే, మరొకప్పుడది సమాజపరంగా, జాతిపరంగా విస్తరిస్తూనే పోతుంది. ఎందరి అమాయక ప్రాణాలనో సమూలంగా దహించి, నాశనం చేస్తూనే ఉంటుంది. అసలు కోపమే పనికి రాదన్నప్పుడు ఇంతటి దీర్ఘకోపం కొనసాగటం మంచిదిగదు. అంతగా మనసును గాయపరచిన సంఘటనయే సంభవిస్తే అందువల్ల ఏర్పడిన వైరం ఆ వ్యక్తి మరణంతోనే అంతం కావాలి. ఇంక మరణించిన వారిని సాధించేదేమిటి? అని ఆ పగ సమసిపోయే విధంగా ప్రవర్తించాలి. కానీ ఈ నాడు మూర్ఖులు కొందరు, గోరంతలు కొండంతలు చేసి వ్యక్తిగత కక్షలు కుటుంబానికి, కులానికి, సమాజానికి అంటగట్టి కక్ష సాధించటానికి పూనుకోవటం దురదృష్టకరం. నేటి దుష్ట రాజకీయ వాతావరణంలో హింస చోటు చేసుకొన్నందున ప్రజలను వివిధ వర్గాలుగా చీల్చి నాయకులు ప్రజల ప్రాణాలతో ఆటలాడు కొంటున్నారు. మారణహోమం జరుగుతుంటే చూస్తూ ఆనందిస్తున్నారు. జాతీయంగాను, అంతర్జాతీయంగానూ ఇదే తంతు. ఇది మానవజాతి క్షేమానికి అభివృద్ధికి ఎంత మాత్రం మంచిదికాదు.

## కామము - ప్రేమము

❖ అకామాం కామయానస్య శరీర ముపతప్యతే (42-22-5)

భా:- ఓ రావణా! నిన్ను ప్రేమింపని వారిని నీవు ప్రేమించినచో శరీరము క్షీణించును.

❖ న కార్యమస్తి క్రుద్ధస్య, నవాచ్యం విద్యతేక్వచితే। (6-55-5)

భా:- క్రుద్ధునకు చేయకూడని పని, అనరాని మాట ఉండదు. ఆ కోపంలో అనర్థ హేతువులైన పనులు చేస్తాడు. అనుచితములైన మాటలు మాట్లాడతాడు.

❖ వాచ్యా ఽ వాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్ (6-55-6)

భా:- కుపితుడైన వానికి సభ్యతగా మాట్లడటం తెలియదు.

❖ కోపం నియచ్ఛన్తి హి సత్త్వ వన్తః (17-52-5)

భా:- సత్వగుణ ప్రధానులైన సాధువులు కోపాన్ని నిగ్రహించుకుంటారు.

సం:- క్రుద్ధుడైన రావణుడు హనుమంతుని వధింపుడని ఆజ్ఞాపింపగా విభీషణుడు (నదూతో వధ మర్హతి) (19-52-5) దూత చంపదగినవాడు కాదని చెప్తూ "కోపమును జయించుట సత్పురుష లక్షణంగా అభివర్ణించి" "నీ వంటి విద్యావంతుడు కూడ కోపమును నిగ్రహించుకోలేనప్పుడు చేసిన శాస్త్రాధ్యయనం కేవలం శ్రమగానే మిగిలిపోతుంది" అని హెచ్చరించాడు.

గృహ్యాన్తే యది రోషేణ త్వాదృశోఽ పి విపశ్చితః
తత శ్శాస్త్ర విపశ్చిత్వం శ్రమ ఏవహి కేవలమ్। (8-52-6)

"అందువల్ల నీటితో నిప్పును చాల్లార్చినట్లు వివేకంతో ఎవరు కోపాన్ని రూపుమాప గలుగుతారో వారు ధన్యులు, మహాత్ములు అవుతారు."

ధన్యాస్తే పురుషశ్రేష్ఠాః యే బుద్ధ్యా కోప ముత్థితమ్
నిరుంధంతి మహాత్మానో దీప్త మగ్ని మివాంభసా॥ (4-55-5)

❖ నదూత వధ్యాం ప్రవదన్తి సన్తః (14-52-5)

భా:- దూతను చంపుట తగదని పెద్దలు చెప్పుదురు

వ్యా:- ఇరు పక్షములలో ఒకరి అభిప్రాయమును, మరియొకరికి తెలియజేసే వాడు దూత, మంచికాని, చెడుకాని ఎవరేమి చెప్తే అతడు అదే ఇతరులకు తెలియజేస్తాడు. (అందులో అతనికంటూ ప్రత్యేకమైన అభిప్రాయం ఉండదు) దూతనే కనుక చంపితే మనం చెప్ప దల్చుకున్న అభిప్రాయం ఎదుటి వారికి అందించేదెవరు? అందువల్ల మన ప్రయోజనం దృష్ట్యా కూడ దూత వధ తగదని పెద్దల తాత్పర్యము.



ఆత్మహత్యకు సిద్ధ పడినా, వెంటనే ఆత్మ ప్రబోధంతో వివేకవంతుల కది పద్ధతి కాదని తెలుసుకొని అభిప్రాయం మార్చుకొని ఆ విధానాన్ని ఇలా గర్హించాడు.

వ్యా:- ఇప్పుడెక్కడ చూచినా హత్యలు చేయటమో, లేక ఆత్మ హత్యలకు పాల్పడటమో చూస్తున్నాం. ఇందుకు కారణం జీవితంలో ఎదురయ్యే సమస్యలు. ప్రతి జీవితానికి ఒక ప్రయోజనం ఉంటుంది. ఆ ప్రయోజనాన్ని అన్వేషించి సాధించుకోవాలి. అందుకై పూర్తి జీవితకాలాన్ని అంకితబుద్ధితో జీవించాలి. అంతేకాని విధ్వంసకర చర్యలతో, నిష్ప్రయోజనం చేసుకోకూడదు. ఆత్మ విశ్వాసంతో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకుంటూ జీవితంలో ప్రగతిని సాధించాలే కాని ఆత్మహత్యకు పూనుకోకూడదు. ఆత్మ వినాశనం అంటే జీవితం నుండి పలాయనం చిత్తగించడమే. అది అసలు సమస్యకు పరిష్కారం ఎంతమాత్రం కాదు.

❖ జీవన్ భద్రాణి పశ్యతి (47-13-5)

భా:- బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు

❖ ధృవో జీవతి సంగమః (47-13-5)

భా:- జీవించి యుండుట శ్రేయోదాయకము, జీవితము ఇష్టులతో కలయికకు కారణము అవుతుంది. అభ్యుదయమునకు సాధన మవుతుంది.

❖ ఆవశ్యం ప్రాణినాం ప్రాణా రక్షితవ్యా యథాబలమ్ (47-9-6)

భా:- జీవులు తమ ప్రాణములను యథాశక్తిగా కాపాడుకోవాలి.

సం:- ఎట్టి పరిస్థితుల్లోను జీవులకు ఆత్మరక్షణ ఆవశ్య కర్తవ్యమని ఋషి విభీషణుని నోట పలికించాడు. రాముడు చేసిన ఖరదూషణాదుల వధను సమర్ధించాడు. "కుశలా న్న ప్రమదితవ్యమ్" అని శ్రుతి పై భావాన్నే సమర్థిస్తోంది.

❖ ఏతి జీవన్త మానన్దః (6-34-5)

భా:- బ్రతికి యున్నవాడు ఏనాటికైనా ఆనందాన్ని పొందుతాడు.

సం:- సీత రాముని క్షేమ వార్త విని రామ వియోగాన్ని అనుభవిస్తూ, తా నిన్నాళ్ళూ కన్నీళ్ళతో, కడగండ్లతో, కాలం గడిపినందుకు వినదగింది విన్నానని సంతోషిస్తూ చెప్పిన మాటలివి.

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా।

ఏతి జీవన్త మానందో నరం వర్షశతా దపి॥ (6-34-5)

రాముని గూర్చిన ఈ శుభవార్త వింటూంటే లోకంలో ప్రసిద్ధమైన ఒక (సూక్తి) మంచిమాట గుర్తుకు వస్తోంది. అదేమిటంటే "జీవించి ఉన్నవాడు ఏ నాటికైనా ఆనందమనుభవిస్తాడు".

వ్యా:- రావణ సంహారానంతరం సీత రామునితోగూడి రత్న సింహాసనాన్ని అధిష్టించి, జగదేక ఆరాధ్యయై వర్థిల్లింది. ఈ సీతారాముల చరిత్ర వర్ణించిన రామాయణమే నిజంగా ఒక కళ్యాణగాథ. ఆ సచ్చరిత్ర మోడు వారిన జీవితాలు కొత్త చిగుళ్ళు తొడిగేలా చేసి, వారికి ఆశావహమైన నిత్య వసంతాన్ని ప్రసాదిస్తుంది.

## అన్నింటికి మనస్సే కారణం

❖ మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే (41-11-5)

భా:- సీతకై వెదకుచు స్త్రీవనంలాగా ఉన్న రావణాంతఃపురంలో తిరుగుతున్న హనుమ "పరస్త్రీ దర్శనం తనకు పాప హేతువు" అవుతుందేమోనని శంకించి, నిర్మలమైన తన మనస్సులో ఎట్టి వికారం కలుగలేదు గనుక దోషం లేదని నిర్ణయించు కుంటాడు.

వ్యా:- ఏ పని చేయాలన్నా ముందుగా మనస్సులో సంకల్పం ఏర్పడుతుంది. మనస్సుకు లోబడి ఇంద్రియములు పనిచేస్తాయి.

❖ చలం హి ప్రాణినాం మతిః (4-20-2)

భా:- ప్రాణుల మనస్సు అతి చంచలము

వ్యా:- చంచలమైన ఆ మనస్సు అనవసరమైన ఆలోచనలు చేయకుండా బుద్ధి శక్తి (వివేకం)తో అదుపుచేయాలి. మనస్సు ఎక్కడో పెట్టుకొని చేయబోతే చేస్తున్న పని కాస్తా చెడిపోతుంది. రోడ్డు ప్రక్కన ఉన్న వ్యాపార ప్రకటనలు చూస్తూపోతే, ప్రమాదాలు జరుగుతాయి. ఏకాగ్రత సాధించినప్పుడే చేసే పనిలో ప్రావీణ్యత సిద్ధిస్తుంది. చదివేటప్పుడు చదువును, ఆడేటప్పుడు ఆటను, పాడే టప్పుడు పాటను తినేటప్పుడు తిండిని కూర్చి మాత్రమే ఆలోచించాలని పెద్దలంటారు. మనస్సు చెదరనంత వఱకు ఎంతటి సాహసకృత్యమైనా సాధ్యమే అవుతుంది. అట్టి ఆత్మ స్థైర్యంతోనే హనుమ సీతను సందర్శించి, అశోకవనాన్ని పెకలించి, రావణునికి బుద్ధిచెప్పి, లంక దహించి విజయోత్సాహంతో తిరిగి



వచ్చాడు. మనస్సును జయించినవాడు సంయమి అవుతాడు. మనస్సును నిగ్రహింపలేనినాడు 'కోరికలే గుఱ్ఱాలు'కాగా మనిషి బలహీనతలకు లోబడి నైతిక పతనాన్ని పొందుతాడు. రక్తికైనా, విరక్తికైనా మనస్సే మూలం.

మన ఏవ మనుష్యాణాం, కారణం బంధ మోక్షయోః।
బంధాయ విషయా సంగి, ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥

తొలుత మనస్సు నరికట్టి, ఇంద్రియాలను జయించిన, రావణుడు త్రిభువనములను (స్వర్గ, మర్త్య, పాతాళములు) జయించాడు. ఎప్పుడైతే పర స్త్రీ వ్యామోహంతో ఇంద్రియ లోలుడయ్యాడో అప్పుడే ఆత్మ వినాశనాన్ని పొందాడు. ఈ విషయాన్ని మండోదరి రణభూమిలో రావణునికి ఇలా స్పష్ట పరచింది.

ఇంద్రియాణి పురాజిత్వా, జితం త్రిభువనం త్వయా।
స్మరద్భి రివ తద్వైర మింద్రియై రేవ నిర్జితః (18-114-7)

## మంచి మనస్సు

❖ రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా (5-2-1)

భా:- నిర్మల జలములు మంచిమనిషి మనస్సువలె స్వచ్ఛంగా ప్రకాశిస్తాయి.

వ్యా:- దురాత్ములెప్పుడు పాపభావనతోనే ఉంటారు. కాబట్టి వారి మనస్సులు కలుషితమై వరదనీరువలె బురదలుగా ఉంటాయి. ఉదారచరితులైన మహాత్ములు రాగద్వేషరహితులై శుద్ధ సత్త్వ స్వభావంతో నిర్మలోదకములవలె ప్రకాశిస్తారు. ఈ మనోనైర్మల్యము సత్య శివ సుందరమైన వారి వ్యక్తిత్వానికి వన్నె చేకూరుస్తుంది. పక్షి బాధగన్న వాల్మీకి ఋషిహృదయంలో దయకలగటానికి ఇదే కారణం.

ఋషేర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత (13-2-1)

## కోపమును విడనాడాలి

❖ క్రుద్ధః పరుషయా వాచా నరః సాధూ నధిక్షిపేత్ (5-55-5)

భా:- కోపం వచ్చినవాడు పరుషమైన వాక్కులతో మంచివారిని (పెద్దలను)సహితము నిందిస్తాడు. ఆక్షేపిస్తాడు.



## కరదీపిక

వాల్మీకివాణి–మానవ జీవిత మహోన్నత లక్ష్యాన్ని చేరుకోవడానికి మనకు వెలుగును చూపే కరదీపిక. ఆశయాలు, ఆదర్శాలు సామాన్యమైన దైనందిన జీవితం. ఈ రెండూ రెండు విధాలుగా కాక మనం చేసే ప్రతి పనిలోను మార్గాలను చూపుతూ, సందేహాలను తీరుస్తూ సవ్యమైన సహజమైన జీవనగమనానికి బాటలు వేస్తూ మనల్ని నడిపించే సాధనం ఈ గ్రంథం. ప్రతి ఇంటా వుండవలసిందీ, ప్రతి ఒక్కరూ చదువవలసిందీ.

మహర్షి వాల్మీకి ప్రణీతమైన శ్రీమద్రామాయణం నుండి ఈ సూక్తులను సేకరించి, మన నిత్య జీవితానికవసరమగు క్రమంలో పేర్చి, అందరికీ అర్థమయ్యేలా వివరించి సంజీవనీ వ్యాఖ్య కూర్చిన **డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారు** అభినందనీయులు.

మానవ మాధవుల కలయికే యోగమంటే. కర్మ ద్వారా భగవానునితో నిరంతరం సంయోగము మిగిలిన విధానాలకన్న శ్రేష్ఠమని, నిరపాయమైనదనీ 'గీత'లో ఆ భగవానుడే చెప్పాడు. శ్రీరాముడు మర్యాదాపురుషోత్తముడు. కర్మయోగానికి వాల్మీకి చిత్రించిన సజీవరూపము, ధర్మానికి పూర్ణావతారము. అటువంటి శ్రీరాముని ఆచరణను వాల్మీకి సూక్తులతో రామాయణం అంతటా చూపగా ఆ సూక్తులన్నీ ఒక క్రమంలో ఈ పుస్తకంలో మన ముందు కనబడతాయి.

ఈ సూక్తులన్నీ చదివి మననం చేసికొంటూ ఎల్లప్పుడూ ఉపయోగించుకొంటూ పరిపరివిధాల పరిగెడుతూ, గందరగోళానికి గురయ్యే మన మనస్సులకు ఒక స్పష్టమైన గమ్యాన్ని నిర్దేశించుకొని ఈ జీవిత ప్రయోజనాన్ని సాధించెదము గాక!

**బి.వి.యల్. శేషగిరిరావు**, యమ్.ఎ.

# వాల్మీకి వాణి

సంజీవనీ వ్యాఖ్యాన సహితము



శ్రీరామచంద్రశ్రిత పారిజాతః
సమస్త కల్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకః
నిరంతరం మంగళ మాతనోతు.

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్న దీపం
ఆజాను బాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి


వ్యాఖ్యాత :
భాషాప్రవీణ, విద్యాప్రవీణ
**డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి**
ఎమ్.ఏ., పిహెచ్.డి.